'ఫిరదౌసి' విశ్వవిద్యాలయ తరగతులకు పాఠ్యగ్రంథముగా నిర్ణీతమై మంచిపేరు కవికి గడించి పెట్టినది. "గబ్బిలము"పై ఈకవి కవితాభిమానము. దేశములోకూడా ఫిరదౌసి, గబ్బిలము, ముంతాజ మహలుల కున్నంత ప్రచారము ఈయన వ్రాసిన ఇతరవాటికి లేదని చెప్పవచ్చు. దేశాభిమానము, ఆంధ్రాభిమానము ఈకవికి హెచ్చు. 1942 దాకా వినుకొండ హైస్కూలులో పండితుడుగా ఉంటూవచ్చి, 1943 లో మద్రాసుప్రభుత్వాన్ని ఆశ్రయించి 'సాంగ్ పబ్లిసిటీ ఆర్గనైజర్' అయి దారితప్పి యుద్ధవాఙ్మయాన్ని సృజించినాడు! అటుతరువాత కవిత్వము చెప్పడమే ఒక ఉద్యోగమైపోయిన ఈయనకు; దేశమాదరించి పలుచోట్ల ఈయనకు సన్మానాలు చేసినది;* వేంకటగిరి, జయపురం, ముక్త్యాలరాజు లీయనను సత్కరించినారు. 'కవికోకిల', 'కవితావిశారద' 'నవయుగ కవి చక్రవర్తి' మొదలైన బిరుదాలను, ధనాన్ని, గండపెండేరాన్ని ఇచ్చి ప్రజలు, రసికులు తమకీతని కవితపైనున్న అభిమానాన్ని చాటినారు. ఈయన కవిత్వము సరళమై, ముద్దులొలికే పలుకుబడితో నిండి ఉంటుంది. ఈయన కలములో విశిష్టమైన ఒడుపు ఉన్నది; మనోహరమైన పదసంపుటులను, హృదయంగమములైన అలంకారములను కూర్చడములో జాషువాకవి నేర్పరి. తెలుగు కవిత్వంలోని తీపి ఈకవి చూపినట్లు నవ్వులలో మరొకరు చూపలేదా అనిపిస్తుంది అయితే మహాగ్రంథమేదీ వ్రాయకపోవడమువల్లకాలపరీక్ష

---

* తన ఊరిలోనే తనకు సన్మానము జరగడము గమనించదగినది. అందులో వినుకొండవారు లేమన్నారో చూడండి :

> వినుకొండం జనియించినావు కవిభూభృన్మౌళివై, నీపయిన్
> ఘనసంఘం బమృతంపువాన కురియంగాఁ జాగె; నీ కొండలో
> న, నెటుల్ పుట్టెనో గాంగనిర్ఝరమనన్ వెల్లువై పారునీ
> ప్రణుత శ్రీకవితా మహాలహరి; మా భాగ్యంబు శ్లాఘ్య కవీ!

కీయన కవిత యెంతవరకాగుతుందో మరి ? కాని తాను చేసిన కృషికి తన జీవితకాలములోనే మెప్పు పొందడము ఎంతో విశేషముగదా ♦

## తుమ్మల సీతారామమూర్తి చౌదరి :

ఈయననుగూర్చి పూర్వభాగములో కొంత గ్రహించి ఉన్నాము. 1920 నుంచి భారతి సంచికలద్వారా తన ఖండకావ్యాలను వెలువరిస్తూ ఈకాలానికి గ్రంథములను ప్రచురించి, సమ్మానాలను పొందీ, తన కవితాసౌరభాన్ని నలువైపులా ప్రసరింప జేస్తున్నా డీకాలానికి. ఈయన గుంటూరు జిల్లాలోని కావూరు గ్రామములో 25-12-1901 తేదీన జన్మించినాడు. జాస్తి సుబ్బయ్య, తాడేపల్లి వెంకటప్పయ్యశాస్త్రి, దువ్వూరి వెంకటరమణశాస్త్రిగారలీ కవికి గురువులై సంస్కృతాంధ్ర సాహితీ పాటవాన్ని చేకూర్చినారు. చినతనమునుంచీ దేశాభిమానమూ, ఆంధ్రాభిమానమూ, పితృగౌరవమూ కలిగి వాటినే తన రచనలలో ప్రతిబింబింప చేస్తూవచ్చిన

---

♦ 'జాషువా కవి రసమయహృదయుడు ... జాతీయప్రబోధమున కీతని కలము గూడ పూనినది ... రసమయ భావము లీతని హృదయములోనుండి వడపోతలు పొంది వచ్చుచుండును .... తెలుగు నుడికారమును భద్రపఱుచుచు, నూతనమైన చక్కని పదసంపుటులను గల్పించుచు, మన స్తత్వ పరిశీలనముచే పాత్రల జిత్రించుచు, నెడనెడ విశ్వసూత్రముల బోధించుచు, నెన్నదగిన నవ్యకవి యనిపించుకొన్నాడు.

— పిల్లలమర్రివారి 'సాహిత్యసంపద'

6-7-47 'ప్రజాబంధు'లో బంకుపల్లి రామజోగారావు గారి వ్యాసములోని ఈక్రింది భాగాలు చూడండి.

"గొప్ప కవులమల్లే ఆయనకూడా స్వేచ్ఛాజీవి. స్వాతంత్ర్య ప్రియుడు... దేశహితార్థం తన కవిత్వం వినియోగించడమే తన లక్ష్యమని ఆయన స్పష్టంగా చెప్పాడు. దేశాన్ని తన కవితతో శీఘ్రంగా సంస్కరించాలని ఆయనకి తీవ్రమైన అభిలాష. ఆయనకు స్వభావసిద్ధంగా గొప్ప ఆత్మ విశ్వాసం ఉంది."

"Rich in imaginary, chaste in style, and superbly sweet in melody of thought and word alike, his poetry move on with the ease and elegance of a majestic river fertilising even the most barren soil on which it may happen to flow "

V. Krishna Rao, 11-6-34.

నవ్యుడీయన. కాంగ్రెసుసేవా తాత్పర్యమీ కవికిమెండు. 1920-29 మధ్యకాలములో అనేక పద్యాలను వ్రాసి జాతీయ కవితాఖ్యాతి గడించినాడు. నవ్యులలో భావావేశము హెచ్చుగా ఉంటుంది. కాని భాషాపాటవం చాలమందిలో అంతగా కన్పించదు. ఈకవి వ్యుత్పన్నుడు కావడమువల్ల పండితులు మెచ్చే శబ్దాధికారమూ, పామరులనాకర్షించే భావావేశమూ ఈయన కవితలో కన్పిస్తవి.


తుమ్మల సీతారామమూర్తి చౌదరి

ఈయన స్వభావము వెన్నలాంటిది; పరమ సౌజన్యమూర్తి సీతారామమూర్తి. స్వాతంత్ర్యప్రియుడు. ఈయనలో ఉన్న గుణాలన్నీ ఈయన కావ్యాలలో కన్పిస్తానే ఉంటవి. ముఖ్యముగా 'రాష్ట్రగానము, (1938) తో ఈయన కెక్కడలేని ప్రాచుర్యము కలిగినది. దేశీయులలో ధర్మాభిరతి కొరవడకుండా కాపాడే నిమిత్తము, ఆంధ్రులలో కార్యోత్సాహాన్ని కల్గించే నిమిత్తమూ ఈయన కవిత్వాన్ని సాధనగా ఉపయోగించుకొన్నాడు. ఈ దృష్ట్యాచూస్తే ప్రథమ నవ్యులలో రాయప్రోలు అందుకున్న స్థాయికి కవి వెళ్ళుతున్నాడనవలె. ఆత్మార్పణము (1932) - ఆత్మకథ (1936) - ధర్మజ్యోతి (1942) - పఱిగపంట (1943) - అమరజ్యోతి (1948) - పెద్దకాపు (1948) - అనే ఖండకావ్యాలు వెంట వెంటనే వెలువడుతూ ప్రజామోదాన్ని చూరగొంటున్నవి. అనేక సమ్మానాలు పలుచోట్ల పొందడమే యిందుకు తార్కాణము 'అభినవతిక్కన' బిరుదాన్నిచ్చి గౌరవించారు పండితులు ఈ అభిప్రాయాలు చూడండి :

"మనచౌదరి యతిప్రాసములకై భంగపాటు చెంది తలగోఁకి కొనుచు బలాత్కారపదప్రయోగములు చేసి, యర్థముననుసరించి పదములు వాడక, పదములఁబట్టి యర్థమును వంపులు పెట్టి నంగఁజేయు నీరసుఁడుగాఁడు. భావ మనర్గళముగఁ బ్రవహించుచుండు నాన్రాయు మహానీయుఁడు. యతి పదాదియందే కాక మధ్యమునను గొనను వ్రాలును. ప్రాసమునకు, యతికైనె పద్యముయొక్క నడక నిలిచి దాఁటవలసిన యిబ్బంది లేదు. అర్థమునుబట్టి పదములు, పదములలో లీనమైనరీతిని యతి ప్రాసములు ననాయాసముగ నప్రయత్నముగ, స్వచ్ఛందముగ వచ్చిచేరుచుండును ఈస్థితియందు ' ప్రసిద్ధుఁడు తిక్కన. ఈవర్గమున తిక్కన్నతో సజాతీయుఁడైనవాఁడు మనచౌదరి అనఁగా సరిసమానుఁడని యతిశయోక్తిఁబలికి యుపాయము దేను. అవర్గమున నగ్రాసనత్వము లేకున్నను నాసనత్వము కలవాడని నామనవి." — కట్టమంచి

'ఆయన ప్రతిభావంతుడే కాదు. వ్యుత్పన్నుడు కూడ. పరిశోధకుడగుటతోపాటు చరిత్రకారుడు కూడ. ధర్మ ప్రబోధకుడైన శిల్పి. స్వస్థాన వేషభాషాభిమానే కాదు. మూర్తీభవించిన ఆంధ్ర మాతృస్థానీయుడు. స్వరాష్ట్రాభిమానే కాదు, స్వాతంత్ర్యప్రియుడు.'

— గొట్టిపాటి వెంకటసుబ్బయ్య.

ఈ అభిప్రాయము అక్షరాలా సత్యం.

---

చూ : కనకాభిషేకసంచికలో శాస్త్రి వెంకట నరసయ్యగారు వ్రాసిన కవిగారి జీవితసంగ్రహము. తుమ్మలవారిపైన ఈ క్రింది వాక్యాలు చూడండి :

"రవీంద్రునివలె తన రాష్ట్రగానముచే నాంధ్రులచిత్తసీమను ఆంధ్రజాతీయతా పరిపక్వభావ, సంస్కార బీజముల హత్తుకొనజేసిన ఆంధ్రరాష్ట్రోద్యమాభిమాని. జడుడై నిర్వీర్యుడై నిర్జీవ ప్రతిమయై దేశభక్తిశూన్యుడుగనున్న ఆంధ్రునియందు నిద్రాణమైయున్న దేశభక్తిని, క్షాత్రమును, విజ్ఞానమును దట్టి లేపగల ఉద్దీపితాంధ్ర శౌర్యభావనావిలసితములు స్వతంత్ర కావ్యగేయముల పలికిన ఆంధ్రభావోద్వల్లి కవీంద్రుడితడు. ఉత్తముడు, భక్తుడు, ప్రకృతి సౌందర్యరసలోలుడు, సాత్వికుడు, కార్మిక కర్షక సమాజ సరళ సాధుజీవనాసక్తుడు ... —దుగ్గిరాల బలరామకృష్ణయ్య.

## మోచర్ల రామకృష్ణయ్య:

నెల్లూరు మండలపుకీర్తిని నవ్యులలో దువ్వూరి రామిరెడ్డి తర్వాత నిలబెట్టగల్గిన ప్రతిభావంతు డీయన నిండుకుండ; మితభాషి; తాత్త్వికదృష్టి ఈయనకు హెచ్చు. ప్రాచీన సంప్రదాయానికి చెందినవాడైనా ఈకవి; వ్యతను తనలో ఇముడ్చుకున్న వ్యక్తి. ఈయన గుంటూరు జిల్లాలోని తూరుపు నాయుడు పాలెంలో 27-5-1904 తేదీనజన్మించినాడు. పండిత వంశానికి చెందినవాడీయన. అందుచేత సంప్రదాయసిద్ధము



గానే సంస్కృతాంధ్రాలలో మంచిప్రవేశం కల్గిన దీయనకు. దుర్భావారి శిష్యుడై కవితా సరస్వతికి స్వయంగా అలంకారాలను చేకూర్చి ప్రసిద్ధికివస్తున్న కవిశేఖరుడు. వృత్తిచేత న్యాయవాది అయినా సాహిత్యకృషి అపారముగా చేస్తున్న వ్యుత్పన్ను డీయన. స్వభావముచేత నిరాడంబరుడు; వినయవంతుడు. ఈయన కవిత్వము ధారాశుద్ధి కలిగి ఉండడమేకాక పాండితీ సంపన్నముగాను ఉండి పాఠకుల్ని రెండువిధాలా ఆనందపరుస్తూ ఉంటుంది. ప్రాచీన పద్ధతిని ఈయన దైవస్తోత్రాల్ని ముందువ్రాసి తనకవితా సాధనకు శ్రీకారము చుట్టు కొన్నాడు. మారుతి (1931) - రమణానందలహరి అనేవి ఆస్తోత్ర కావ్యాలు, వీటిలో నడిపించిన పద్యాలను చూస్తే మంచి పలుకుగల కవిఅనీ, ప్రాచీనకవుల పద్యరచనా ధోరణిని పుణికిపుచ్చు కున్నవాడనీ గమనింప గల్గుతాము. * తర్వాత జగన్నాథ పండిత రాయల 'గంగాలహరి'నీ (1937), వేదాంత దేశికుల 'హంస సందే శాన్ని' (1937), శంకరాచార్యుల 'ఆత్మబోధము'నూ (1941) ఆంధ్రీకరించినాడు. ఎందరు వీటిని ఈకాలములో అనువదిస్తూ, ఉన్నా ఈయన ప్రత్యేకత ఈయనదే. 'ప్రేమలీల' (1942) అనే సాంఘికనాటకాన్ని రచించిన ఈకవిని గమనిస్తే నవ్యుడనిపించి తీరు తాడు. 'ప్రపంచభార్గవ' మనే నాటకాన్ని చిన్నచిన్న రంగాలతో నిర్మించిన విధముచూస్తేకూడ ఈయనకు ఆంగ్లసంస్కార మెంతగా ఉన్నదో విశదమౌతున్నది. డాక్టరు రాఘవన్‌గారి 'కామశుద్ధి' అనే సంస్కృత నాటికను చక్కగా అనువదించీ (1950), 'శారదా ప్రసాదః' అనే సంస్కృతకావ్యాన్ని రచించీ (1949) 'అమృత కలశమ'నే కావ్యము, ధ్రువవిజయము, ఛత్రపతి శివాజీ అనే

* ఈ పద్యములో పదబంధాదుల్ని చూడండి :

లలితోద్యన్మణి కుండలోజ్జ్వలకపోలా! చారుసౌదామనీ
తులితాకార! సుపాటలానన! దృఢాస్తోకస్ఫురద్వక్ష! మాం
సలదోర్దండ! పిశంగనేత్ర! పటుశశ్వద్దీర్ఘలాంగూల! మం
జుల కార్తస్వరహస్తకంకణ! జగత్ స్తుత్యాకృతీ! మారుతీ!

నాటకాలు వ్రాసి, ఈకవి బాగా ప్రసిద్ధిలోకి వస్తున్నాడు. ఈయనకు సహృదయులు పండితులు ఇచ్చిన సరసకవి–కవిశేఖర–సాహిత్యరత్న–బిరుదాలే ఈయన♦ కవితాశక్తినీ, సాహిత్యసంపత్తినీ వేరుగా చెప్ప నక్కరలేకుండా వ్యక్తీకరించ గలవు.

## పెనుమెచ్చ సత్యనారాయణ రాజు :

నవ్యాంధ్ర కవులలో ఈకాలానికి పైవారితోబాటు ప్రసిద్ధిలోకి వచ్చినవారిలో ఈ 'తెలుగురాజు' ఒకడు. ఈయనను పండితరాజని దేశమూ, కవిరాజని జయపురాధీశుడు * పిలుచుకొని సమ్మానించినారంటే ఈయన పాండిత్యాన్నిగూర్చి వేరే వ్రాయవలెనా? కంఠములో శ్రావ్యతా, ఆకృతిలో సౌకుమార్యమూ, దృష్టిలో నైశిత్యమూ ఉన్న ఈయన ప్రత్యేకవ్యక్తి! పశ్చిమ గోదావరి జిల్లాలోని కాకరపఱ్ఱులో 20–12–1899 తేదీని జన్మించి, సుప్రసిద్ధ పండితులైన చర్ల నారాయణశాస్త్రిగారి కడ శిష్యులై, సంస్కృతాంధ్రాలలో శిక్షపొందినాడు. చిన్న తనమునుంచీ సాధనచేస్తూ

---

♦ రాటుదేలిన ఈయన కవిత్వానికి ఉదాహరణలుగా రెండు పద్యాలను చూడండి :

పటుఘాటీకపురారి సాంధ్యనటనవ్యాలోలలీలా జటా
ఘటనాభోగ కనత్తరంగ నవశృంగారైక హస్తక్రియ
స్ఫుటతా వ్యంజకమున్ బిలాంతచలదంబు ధ్వానకోలాహలో
ద్భటవాదిత్రము గాంగ తాండవము విధ్వంసించు మా పాపముల్.

శరదిందుద్యుతియై, శశాంకశకల స్వాయత్తకిరీటాఢ్యయై
కరసంభాబ్జ వరాభయోల్లసితయై కమ్రచ్ఛృతాకార సుం
దర భూషాంబరయై, విశుభ్ర మకరోద్యద్వాహనారూఢయై
పరివర్థిల్లు నినున్ భజించినఁ బరీభావంబు లే దేరికిన్.

మోచర్లవారు "గిరిజాకళ్యాణము, త్యాగమహిమ" అనే వచన గ్రంథాలను కూడ వ్రాసినాడు.

* జయపురసంస్థాన గౌరవాస్థానకవిగా ఈయన నియమితుడై నూఱెకరాల భూమినీ, తణుకులో దివ్య భవనాన్ని శ్రీవారి కానుకగా పొందినాడు!



పెనుమెచ్చ సత్యనారాయణ రాజు

* ఈయన ఈకాలానికి రాటు దేలిన కవిత చెప్పతూ, కావ్యాల్ని ప్రచురిస్తూ, సాహిత్య గోష్ఠులలో పాల్గొంటూ మంచి ప్రచారము లోనికి వచ్చినాడు శతకం - ప్రబంధం - అవధానం- మొదలైన ప్రక్రియ లన్నిటి నీ సాధించిన ఈకవిప్రాచీనుడు. ఖండకావ్యం - నవలలను సాధించిన నవీనుడున్నూ !

చంపకమాలినీ పరిణయము (1925) - పతిభక్తి (1927) - జ్ఞానాంజలి (1931)-దక్షారామ భీమేశ్వర శతకము (1937) - రసాలము (1941) - కవిత్రయావేదన (1934) - విజయశ్రీ (1944) - విక్రమదేవశతకం (1947) - ఆరాధన (1949) అన్నవీయన ఇప్పటికి ప్రకటించిన పద్యకావ్యాలు. ఈయన వ్రాసిన చాటువులనేకము 'పండిత రాజచాటువుల'నే పేర ప్రసిద్ధికెక్కుతున్నవి. 'రాజానంద' (1942) మనే పేరుతో చంద్రాలోకాన్ని తెలుగు పద్యాలలోకి అవతరింపజేసిన అలంకారికు

---

* ఆశుకవిత్వము తోపూ అవధానాల తోపూ కొద్దికాలము దృష్టి మరలిందికూడ.

డీయన, ఉత్తర రామాయణమును వచనకావ్యముగా (19?3) అవతరింపజేసినాడు. తపోభూమి (1943)-రత్నసుందరి (1947) - మనస్విని (1948) మొగలిరేకు (1948)-గోరువంక (1949) మొదలైన నవలలున్ను వ్రాసీ, ఇంకా చాలా వాఙ్మయాన్ని అధికముగా కూర్చి ప్రాచుర్యము పొందుతున్నాడు. ఈయన హైస్కూలు పండితుడుగా గుడివాడలోను (1920-1924), తణుకులోను (1924-43) పనిచేసి అనేక యువకులలో* దేశభక్తినీ, ప్రగతిశీలాన్నీ, సాహిత్యాభిరుచినీ కల్గించినాడు. కొంతకాలము దారితప్పి గవర్నమెంటు లేబరు శాఖలో ట్రాంసులేటరుగాను, అసిస్టెంటు పబ్లిసిటీ ఆఫీసరుగాను పనిచేసినా, మళ్ళీ ఆంధ్రపండితుడుగా భాషాసేవచేస్తూ రావడంవల్ల ఆదోషంపోయినట్లే. ఈయన కవిత్వములో పూర్వకవుల ధోరణులు బాగా కన్పిస్తవి.♦ నవ్యకవిగా పేర్కొనేటందుకు భావచిత్రణము మెండుగానూ అగుపిస్తుంది. అచ్చతెనుగును,‡ సంస్కృతమును, తెలుగు నుడికారాన్నీ, చమత్కారార్థం అన్యదేశీయాల్నీ - అన్ని

---

* నార్ల వెంకటేశ్వరరావు, తుమ్మలపల్లి వెంకటరత్నకవి, మొదలైన ప్రతిభావంతు లీయన శిష్యులు నవ్యసాహిత్య ప్రవర్తకు లెందరో ఉన్నారు.

♦ పద్యాల ఎత్తుగడలలో నిర్వహణాలలో, సమాసాలలో పూర్వుల ననుసరించడమే కాకుండా, బుద్ధిపూర్వకముగా నన్నయ, తిక్కన, శ్రీనాథాదుల ప్రయోగాలను యథాతథంగా తన పద్యాలలో జొప్పించుకొని మురిసిపోతున్న నవ్యుడితడు: కవిత్రయా వేదనము చూడండి.

‡ తబ్బిబ్బుల్ పటి తప్పటడ్గు విడుచుందల్లీ! యటుంచడు రా
అబ్బాయీ! యని చంకఁబెట్టుకొని వేయల్లంత పైకెత్తుచుకా
అబ్బోబ్బనాయన! బూచివచ్చెనదిగో అల్లారుముద్దాయటం
చ లాడుచు కూర్కఁజేయుసిరియాహా యెప్డునాకబ్బెడుకా.

అంతలో సంస్కృతపుజిగి, అంతలో తెలుగు తియ్యదనం, అంతలో ప్రబంధ ప్రౌఢిమ, అంతలో నవకవితాలాలిత్యం. — నార్ల : 'ఆరాధనా పీఠిక'

టెన్నీ తన కవిత్వములో సాధించిన ప్రజ్ఞావంతు డీయన. ♦ ఆరాధన అనే ఖండకావ్యము దీనికి తార్కాణము. దేవాలయములోనికి హరిజనప్రవేశ మిందులోని కథావస్తువు. కవి రచనలో భావావేశములో చూపిన నేర్పు మెచ్చదగింది. పలుకుబళ్ళ పొందికా — శైలీ సారళ్యమూ హెచ్చుగా ఉండి ఎక్కడా పట్టివ్వకుండా ఉండడము ఇందులో గమనించతగింది. కవి హరిజనాభ్యుదయానికెంతో తోడ్పడినాడీ కావ్యరచనద్వారా అనవలె. సహజమైన ఉక్తి చమత్కారం ఈయన కవిత్వానికి మెరుగు పెట్టుతున్నగుణం. మూర్తిని కట్టించడములోను ఈయన కున్న శిల్పచాతుర్యం పూర్వకవుల్ని పోలినదే.‡ కవే కాక కర్షకుడున్నూ కావడము వలన ఈయన వ్రాసిన ఖండకావ్యాలలో నవ్యస్పందము అగుపిస్తూఉంటుంది.† మొత్తముమీద ద్వితీయ శ్రేణిలోని నవ్యాంధ్రకవులలో (Second Band of Moderns) పెనుమెచ్చవాగికొలక విశిష్టస్థాన మున్నదని గ్రహించవలె.

పైన పేర్కొన్నవారే కాకుండా ఇంకా పలువురు కవులు పలుచోట్ల కృషిసాగిస్తూ నవ్యసాహిత్య వ్యాపనానికీ, తదభివృద్ధికీ

---

చూ: "జాతీయ విజ్ఞానము"లో నాదెళ్ళ కృష్ణమూర్తిగారు వ్రాసిన 'తెలుగు రాజు కళావిభూతి' అన్న వ్యాసము.

‡ ఈ పద్యాన్ని చూడండి:

ఎక్కినఁ జొక్కి సల్పదక యించుక వాలము త్రిప్పి యెత్తి పై
నిక్కఁగ వీను రిక్కగ ఘణిల్లని యంకియ వెట్టి కొమ్ములన్
బిక్కకు నెట్టి జిల్గు మెడపట్టియ మువ్వలు ఘల్లుఘల్లనన్
దిక్కులదారిలో మెఱుపు రెక్కనురీతి దువాళివాఱుచున్.

† తుమ్మలవారిలోను, తర్వాత ఏటుకూరివారిలోను ఈ విధమైన విశిష్టత కన్పిస్తుంది. రైతుప్రీతి అనవచ్చు దీనిని.

'రసాలము'లో ఉల్లికోళ్ళు, ఆంధ్రోన్నత్యము, కమ్మరీడు ఇత్యాదులు నవ్యధోరణి విలసితాలు.

పాటుపడుతున్న వారున్నారు*. వారిలో కొందరి సాధనాన్ని పూర్వ భాగములో ఉల్లేఖించుకొనే ఉన్నాము; కొందరింకా సాధనచేస్తూ తృతీయ చతుర్థ శ్రేణులలో నిలువదగినవారుగా ఉన్నారేగాని ఇప్పటికింకా బాగా స్థిరపడ లేదు. వీరిని గురించి తర్వాత ముచ్చటించుకొనే అవకాశము వస్తుంది. నవ్యులకూ అతి నవ్యులకూ మధ్య నిల్చిన వారి నిక్కడ గ్రహించుదాము. వీరు మంచి ప్రసిద్ధిలోకి వచ్చినారుకూడ.

---

తమ ఖండకావ్యాలతో ఈకాలానికి ముందువెనుకలుగా నవ్యసాహిత్యాన్ని పెంపొందిస్తున్న వారిలో విశ్వనాథ వెంకటేశ్వర్లు, బొడ్డు బాపిరాజు, భారతుల మార్కండేయశర్మ, కె. అన్నమరాజశర్మ, పువ్వాడ శేషగిరిరావు, అత్తిలి సూర్యనారాయణమూర్తి, కర్లపాలెం కృష్ణరావు, వారణాసి వెంకటేశ్వర్లు, ఊటుకూరి సత్యనారాయణరావు, కందుకూరి రామభద్రరావు, సహదేవ సూర్యప్రకాశరావు, వింజమూరి శివరామరావు, పెమ్మరాజు లక్ష్మీపతి, ఖండవల్లి లక్ష్మీరంజనం, గడియారం రామకృష్ణశర్మ, తుమ్మలపల్లి వెంకటరత్నం, అంబడిపూడి వెంకటరత్నం, జంధ్యాల పాపయ్యశాస్త్రి, రజనీకాంతరావు, దేశిరాజు కృష్ణశర్మ, ఏటుకూరి వెంకట నరసయ్య, పులవర్తి శరభాచార్య, వేదాంతకవి, జనమంచి కామేశ్వరరావు, కృత్తివాస తీర్థులు, వట్టికొండ రంగయ్య, కొమరవోలు నాగభూషణరావు, కొత్తపల్లి జగ్గయ్యచౌదరి, పుట్టపర్తి నారాయణాచార్య, పిల్లలమర్రి హనుమంతరావు, సామవేదం జానకిరామశర్మ, దేవరకొండ బాలగంగాధరతిలక్, గుదిమెళ్ల రామానుజాచార్య, సంపత్, వావిలాల సోమయాజులు, రావూరు సత్యనారాయణరావు, రామనాథం, భాగీ నారాయణమూర్తి, స్థానాపతి రుక్మిణమ్మ, చావలి బంగారమ్మ, పులవర్తి కనకమ్మ, వట్టికొండ విశాలాక్షి, విశ్వసుందరమ్మ, సౌదామిని, ఆంజనేయప్రసాద్, జమదగ్ని, వానమామలై వరదాచార్యులు, జమ్మలమడక సూర్యప్రకాశరావు, అడ్లూరి అయోధ్యరామయ్య, సన్నిధానం శ్రీధరశర్మ, దేవులపల్లి రామానుజారావు, పెనుమర్తి కామేశ్వరరావు, పల్లా దుర్గయ్య, ప్రభృతు లెందరో అసంఖ్యాకు లున్నారు. వీరిలో ప్రసిద్ధికివచ్చి ఈ నాటికి స్థిరపడిన కొందరినిగూర్చి సవివరముగా తెలుసుకునే సందర్భం ముందువస్తుంది.

## కొందరు నవ్యులు

భావకవిత్వాన్ని చెపుతూ, దాన్నిగూర్చి అభినివేశముతో ప్రసంగిస్తూ, వ్రాస్తూ వచ్చిన యువకులలో కొందరి నిక్కడ ప్రస్తావించుకొని తీరవలె; వీరు రవీంద్రునిలోని గూఢతనూ, తల్లావఝ్ఝల రాయప్రోలు, దేవులపల్లులలోని ప్రణయతత్త్వాన్నీ తమ కవితలో ఇముడ్చుకుంటూ, అతి నవ్యుల ధోరణిపైన కొంత సానుభూతి చూపిస్తూ నవ్యులకూ అతినవ్యులకూ మధ్యనిల్చినారు. అలాంటి వారిలో పురిపండా అప్పలస్వామి, మల్లవరపు విశ్వేశ్వరరావు, పిలకా గణపతిశాస్త్రి, ఇంద్రకంటి హనుమచ్ఛాస్త్రి, పిల్లలమర్రి హనుమంతరావు, పైడిపాటి విద్వాన్, బాలాంత్రపు రజనీకాంతరావు, వింజమూరి శివరామారావు, వావిలాల సోమయాజులు, పుటపర్తి నారాయణాచార్య, మొదలైనవారు కొందరు. వీరిలో కొందరి రచనలలో హెచ్చుగా భావకవిత్వపు ధోరణీ, కొద్దిగా అతినవ్యుల ధోరణీ అగుపిస్తూ ఉంటవి. శిష్ట్లా, శ్రీ. శ్రీ. లు ఈ కాలానికి సంచలనం కల్గిస్తూ అతి నవ్యమార్గాన్ని వేస్తున్నారు. కాబట్టి వారితో నడుస్తూన్న ఈ యువకులకా గాలి సోకడములో ఆశ్చర్యమేముంది! కాని తర్వాత దశాబ్దికాలానికి వీరు నవ్యకవులనే ప్రసిద్ధిచెందుతూ వచ్చినారని స్పష్టంగా తెలుస్తుంది. వీరిలో కొందరి కృషిని గూర్చి ఇక్కడ తెలుసుకుందాము: ఈ యువకవులు పలుముఖాలా నవ్యకవిత్వాన్ని విస్తరిలజేసిన ప్రతిభావంతులు.

## పురిపండా అప్పలస్వామి:

ఈయన కవితాసమితి కార్యదర్శిగా నవ్యసాహిత్య వ్యాపనానికి ఎంతో తోడ్పడినవాడు. స్వయముగా నవ్యకవి. అతి నవ్య ధోరణి కొంత ఈయన రచనలలో కన్పిస్తుంది. విశాఖపట్నంజిల్లాలో ఈయన (జననం 1904) తొలుత కవులను పండితులను సమితిసభ్యులనుగా [illegible]

బెంగాలీ, ఒరియా, హిందీభాషలలో మంచి ప్రవేశము సంపాదించిన నవ్యుడు. 'కవిసంశయ విచ్ఛేదము'ను పరిశోధించి సంపాదించిన (1925) పండితుడు. ఒరియా భాషలోనుంచి అశ్వినీకుమార ఘోషు వ్రాసిన కళాపహాడ్ అనే నాటకాన్ని తెలుగులో అతి సహజమైన ధోరణిలో వ్రాసి అందించినాడు. ఒరిస్సా వింతల్ని గూర్చి యీయన వ్యాసాలు భాషావినోదాల దృష్ట్యా గణింపదగినవి. కృష్ణశాస్త్రిగారి ప్రభావం ఈయనపైన మొదట్లో పడిందనీ, టాగూరు నజరుల్ ఇస్లాములపైన మోహము, శ్రీ శ్రీ పైన అభిమానము ఉన్నట్లూ ఈయన రచనలనుబట్టి గ్రహించగల్గుతాము. ప్రేమకవిత్వం వ్రాసి భావకవి అనిపించుకున్నాడుకూడ. శ్రీ శ్రీ ఈయన కవితను ఆంగ్లంలోకి అనువదించి త్రివేణిద్వారా అందిస్తూ ఈయనకు బహుళప్రచారము కల్గించినాడు. వాటినన్నీ కలిపి ఒక పుస్తకముగా వేసినారుకూడ. ఇందులో ఉన్న బొమ్మల్ని, శ్రీ శ్రీ వ్రాసిన పీఠికాచూస్తే పురిపండా శ్రీ శ్రీ లకున్న అనుబంధం వ్యక్తముకాక తప్పదు. ప్రతిభ, ఉదయిని మొదలైన పత్రికలద్వారా పురిపండా క్రొత్తపద్ధతిని ఖండకావ్యాలు వ్రాస్తూ వచ్చి ఈకాలానికి బాగా స్థిరపడిన అధివాస్తవికతకు దారి తీసినవారిలో ఒకడనిపించుకుంటున్నాడు. * ఈయన కలములో ఒక

* 'పురాకృతము'నే రచనలో చూడండి ఈ నవ్యుని భావావేగము, భాషా నైశిత్యమూ:

గౌతమముని ఛిన్నాస్థులకోసం
కలహించిన నా పూర్వుల మాఢ్యం
కబళం కోసం భిక్షాపాత్రిక
పగిలించిన మా వ్యాసుని స్వార్థం
అనపరాధిని సీతమ్మ నడవులకు
వెడలించిన మా రాముని క్రౌర్యం
బానిసనిగా
బిచ్చగానిగా
పతిత జీవిగా
చేసి నన్నిపుడు
[illegible]!

ధూళుడు కన్పిస్తుంది; హృదయాన్ని ఆవేశంతో తరిమి తన్నే ఆవేగం భాషాభావాలలో పురిపండా సాధించి తర్వాత వచ్చిన గేయకవుల కనేకులకు ప్రత్యక్షముగాను, పరోక్షముగాను మార్గదర్శకుడైనా డనవలె. ఈవిధముగా తాను నవ్యుడు అవుతూ, అతి నవ్యుడు* కాకుండా ఉండలేకపోతూ – ఉన్న పురిపండా ఉభయమార్గాలకు వంతెన కట్టుతున్న వాళ్ళలో చేరుతున్నాడు.

* ఈయన 'అనలపతాకం'లో ఈచరణాలు శ్రీ శ్రీ ధోరణిలో లేవూ? చూడండి:

కన్నీళ్ళారని నా నట్టింటను
కరాళనృత్యం సాగిస్తున్నవి
నరకజ్వాలలు వెలిగిస్తున్నవి
అనలపతాకం అనలపతాకం
అంబర వీథుల మెరసింది
కాంచనగంగా ధవళ శిఖరిపై
రక్తదీధితులు విరిసాయి
బానిసలారా! వంచితులారా
గొలుసులు త్రెంపుకు లేవండి!
జయ జయ జయ జయ జయధ్వనులతో
కరములుచాచీ మొక్కండి!
అనలపతాకం అనలపతాకం
అనంత సీమల సాగింది
సాగరవేలా సైకత భూముల
ఝంఝూపవనం రేగింది
అశ్రులు తుడిచీ – అనలంనించీ
అతల వితలములు చూడండి!
విషణ్ణ హృదయం విశీర్ణకాయం
బలివేదికపై నిలపండి!
అనలపతాకం అనలపతాకం
అజస్ర మజస్ర మెగిరింది
తారాగ్రహముల తరుణాంగణమున
వజ్రకవాటం పగిలింది
బానిసలారా లేవండి!
భైరవిమంత్రం చదవండి!
ఆకలి ప్రాణం వ్యాకులజీవం
ప్రళయం ప్రణవం పాడండి!

## మల్లవరపు విశ్వేశ్వరరావు :

భావకవిత్వపు బాటలలో నడిచిన యువకులలో ఈయనకొక ప్రత్యేకస్థాన మున్నదనే చెప్పవలె. విశ్వభారతి గురుకులవాసంచేసి వచ్చిన ఈయన భావనాబలం మెండైనది; గాలిలో మేడలుకట్టే దృష్టి ఈయన కవిత్వంలో ఎక్కువగా అగుపిస్తుంది. విరుద్ధభావ ప్రకటనము దేవులపల్లి వారిలోవలె ఈయనకవితలోను కన్పిస్తూ ఉంటుంది. ఈయన (జననము 1906) ప్రచురించిన ఖండకావ్య సంపుటిని చూస్తే ఈవిషయం బాగా బోధపడుతుంది. గ్రంథనామమే 'మధుకీల'. దీని ముఖపత్రంమీద ఒకబొమ్మ ఉన్నది. దానిలో ఒక కల్లుకూజా-ఒకజ్వాలా, ఒక పుష్పమూ ఉన్నవి. పుష్పంలో నుంచీ తీసిన మధువును క్రోలడంవల్ల హృదయములో జ్వాల బైలుదేరినట్లు అర్థము చెప్పవచ్చునేమో. ఈకవి భావోన్మాది అనీ, మెత్తని హృదయ తంత్రులు కలవాడనీ, ప్రణయమే ఈయన కావ్యవస్తువని కనపడుతుంది. ఈయన రచనలలో ఆవేదన అనిర్దిష్టతా అగుపిస్తవి.* హృదయమూ, భావనాశక్తీ, అంతస్సంగీతం కలవాడు కవి అని నిర్వచిస్తే ఈయన వాటిని బాగాకల్గి ఉన్నాడనవలె. ఈయన నవ్యకవిత్వముపైన (భారతిలో, నవోదయలో) వ్యాసాలు మంచి విలువ అయినవి అనేకం వ్రాసినాడు. ♦ అతి నవ్యమార్గముపైన సానుభూతిఉన్న నవ్యుడీయన; "ప్రతిభ"లో హ్రీం.హ్రీం అన్న ప్రచ్ఛన్న నామముతో కొంత అతివాస్తవిక ధోరణి ననుకరిస్తూ వ్రాసినాడు.

---

* రంగురంగుల కలలన్ని రగిలి రాజె
నొక్క-కాలాగ్ని కీలగా! — ఒకడ కనలు
తత్తరాగర్భమున భగ్నతరణిభాతి
మునిగిపోయితినో యేమొ!...

'కల్యాణకింకిణి' అనే యీయన ఖండకావ్యము నవ్యధోరణికి చెందినదే.

♦ రవీంద్రుని 'చిత్రాంగద'ను గేయనాటికగా అనువదించినాడు. గురుదేవుల ప్రభావ మీయనపైన ఎంతో ఉన్నదని ఈయన రచనలే స్పష్టము చేస్తూ ఉంటవి.

అయినా ఈయన తన్మార్గానుయాయి కాడనే ఆ గీతావళే తెల్పుతున్నది. ఊతమైనమాటలువాడడం – ఆత్మపరీక్ష చేసుకోవడం – అనుస్యూతమైన అర్థము కల్పించడం – ఈయన సక్రియలిస్టు కాడని తెల్పుతున్న అంశాలు. ఈయన గేయాలు ఎందరి యువకులనో తర్వాత సాధకులను చేసినవంటే వీటి ప్రభావాధిక్యాన్నిగూర్చి చెప్పనక్కరలేదు. భాషలోను భావములోను గాఢత ఎక్కువగా సాధిస్తూ టాగూరు – కృష్ణశాస్త్రిగారల ప్రభావానికి లోనైనవాడుగా కన్పిస్తాడీయన; భావోన్మాది అనీ, ప్రేమతపస్వి * అనీ ఈయన రచనలే ఋజువుపరుస్తవి. అయితే మొదట్లో చేస్తూవచ్చిన కృషి క్రమంగా తర్వాత కాలానికి సన్నగిలిపోతున్నట్లు గమనిస్తాము. ఏమైనా రాయప్రోలు కృష్ణశాస్త్రి దేవులపల్లుల శాంతినికేతనప్రవాసనల్ని తర్వాత వచ్చిన వారిలో ఈ మల్లవరపు పర్వచేసినవాడని మాత్రం చెప్పవలె.

## పిలకా గణపతి శాస్త్రి:

ఈకాలములో భావకవిత్వాన్ని, అభినివేశముతో తమరచనల ద్వారా ప్రవర్తిలచేసిన యువపండితులలో ఈయన పేర్కొనదగినవాడు. తూర్పు గోదావరిజిల్లా కట్టుంగ గ్రామములో 24-2-1911 తేదీని జన్మించినాడీయన; మొదటినుంచీ సంస్కృత సాహిత్యములోనే కృషిచేస్తూ విజయనగరం సంస్కృతకళాశాలనుంచి (1927-33) సాహిత్యవిద్యాప్రవీణుడుగా, వెలుపలి లోకంలోకి వచ్చినాడు. పి. ఓ. యల్., విద్వాన్, పరీక్షల నిచ్చినాడు: ఈయనలో కవితాంశ హెచ్చు. గణపతి శాస్త్రిగారి హృదయం సుకుమారమైంది; ప్రతిభా

---

* స్త్రీమూర్తి నీయనకూడ ఆరాధించినాడు, చూడండి:

అలపుగొన్న నాస్వప్న జీవితావరణం
మేలుకొలిపి

నాహృదయోద్భవనంలో దీపం నిలిపితివే
విలసితలావణ్య శ్రీవై – స్త్రీవై! – శ్రీవై!

పండితుడు. స్వయముగా ఆంగ్లం, ఫ్రెంచి, హిందీ, భాషలలో ప్రవేశము సంపాదించుకొని ఆ భాషాసాహిత్యాలను పరిశీలిస్తూ, ఇటు తల్లావఝ్ఝల నాయని, దేవులపల్లి మొదలైన నవ్యుల ఉపన్యాసాలకూ రచనలకూ, ముగ్ధుడౌతూ హృదయం విశాలం చేసుకొని కవితాసాధన చేస్తూ (1932 నుంచి) వచ్చినాడు. పద్యాలు - గేయాలు* నాటికలు - వ్యాసాలు ఉదయిని-భారతి-ప్రతిభ మొదలైన పత్రికలలో బహుళంగా వ్రాస్తూ తర్వాత యువకవులలో పలుకుబడిని సంపాదించినాడు. ఆహ్లాదకరమైన ఆకృతీ, శ్రావ్యమైన కంఠమూ-కలిగి, భావకవి అంటే స్త్రీ ప్రకృతి హెచ్చుగా కలవాడనే ప్రజాభిప్రాయానికి బలం చేకూరుస్తూ ఉంటాడు. "నిర్భాంతామరుకము - రత్నోపహారము" లనేవి ఈయన ఖండకావ్యాలు. వీటిలో సిరితభావనాబలం, దానికి మెరుగుపెట్టే రచనా సౌందర్యం కన్పిస్తవి.• ఈయన వ్యాసాలలోను వైదుష్యము వ్యక్తమౌతూ ఉంటుంది. మీనాంబిక అనే చిన్న నవల వ్రాసీ - శరత్ నవలనూ (గృహదహనము) అనటోల్ ఫ్రాన్సు వ్రాసిన రెడ్ లిల్లీలను అనువదించీ - ఈ నవ్యుడు తనకున్న ప్రతిభనూ ఇతరభాషా పరిచయాన్నీ ప్రకటిస్తున్నాడు. రాజమండ్రీలో ఆంధ్రయువతీ సంస్కృత పాఠశాలలోను, వీరేశలింగం పాఠశాలలోను (1937-1945) పండితుడుగా పనిచేస్తూ నవ్యసాహిత్య వ్యాపనానికి ఎంతో సహాయము చేసినాడు. 'ఆంధ్రశిల్పి' సంపాదకుడుగాను, ఆంధ్ర దినపత్రికలోను, ప్రస్తుతం భారతిలోను పనిచేస్తూ ఉన్న సాహిత్యోపజీవి ఈయన. గణపతి శాస్త్రిగారి కాలానికీ నవ్యమార్గాన్ని వ్యాపనం చేస్తూ. ధ్వనివాదియై, కాల్పనిక కవులలో (Romantic Poets) చేరుతున్నాడు. శ్రీ. శ్రీ. ఇత్యాదుల ప్రయత్నాలపైన సానుభూతి చూపుతూవచ్చినా ఈయన మాత్రం తదుద్యమానికి వ్యతిరేకి అనే ఈయన రచనలనుబట్టి గ్రహించగల్గుతాము.

---

* ఈయన వ్రాసిన 'మాదాకబళంతల్లీ' అన్న గేయంపైన గాలిదుమారం లేగింది. చెళ్ళపిళ్ళవా రెదురుకున్నారు! నాటినుంచీ నలుగురికళ్ళా బడినాడీయన.

• ఈనాడు రేడియోద్వారా ఈయన రచనలకు మంచి ప్రచారం లభిస్తున్నది.

## ఇంద్రకంటి హనుమచ్ఛాస్త్రి :

గణపతి శాస్త్రిగారివలెనే ఈయనకూడ సంప్రదాయజ్ఞుడు. సంస్కారాభిలాషి. సంస్కృతాంధ్రాలలో 'ఉభయభాషాప్రవీణు'డు కావడమేకాక కవితాహృదయంతోను విమర్శదృష్టితోను ఆ రెండు సాహిత్యాలను అవలోకించినవాడు. నవ్యాంధ్ర సాహిత్యవ్యాపనానికీయన తన విమర్శలతో, ఎంతో సహాయపడిన వ్యక్తి విశాఖపట్నం జిల్లా మాడుగులులో 23-8-1911 తేదీన జన్మించి తూర్పుగోదావరి జిల్లాలోని పాలగుమ్మిలోను, విజయనగరం - కొవ్వూరు సంస్కృత కళాశాలలలోను చదివి, రెండు భాషలలోను పరిశ్రమ చేసినాడు. ఈయన 1932 నుంచి పాటలు వ్రాస్తూ, 1942 దరిమిలా పద్య రచనచేస్తూ, భారతీత్యాది పత్రికలలో అనేకవ్యాసాలు, కథలూ, నాటికలూ వ్రాస్తూ నవ్యసాహిత్య రంగములో విశేషముగా కృషిచేస్తున్నాడు. ఈయనపైన కృష్ణశాస్త్రిగారి ప్రభావము హెచ్చుగా ఉన్నదనవలె. పూర్వకవుల ధోరణులలో నన్నయ శ్రీనాథులవారిపైన ఈయనకు గౌరవము మెండని తెలుస్తుంది. ఈయన వ్రాసిన పాటలమంజరి - వ్యాసావళి - కథలు గ్రంథరూపం దాల్చినవి. నవ్యులపైన వ్యామోహమూ, అతినవ్యులపైన ఆదరమూ ఉన్న ప్రగతి శీలంగల పండితుడీయన. శ్రీ. శ్రీ 'ఇంద్రకంటివారిని' ప్రామాణికునిగా గ్రహించిన స్థలాలను బట్టి కూడ ఈయన అతి నవ్యుల కెంత ఊతఇచ్చిందీ గ్రహించవచ్చు. ఈయన వ్రాసిన పాటలనేకము రేడియోద్వారా మంచి ప్రాచుర్యము పొందుతున్నవి. వ్యాసరచనలో ప్రజ్ఞసంపాదించి గణన కెక్కుతున్న విమర్శకుడు. కొంతకాలము పత్రికాసంపాదనములో ఉండీ, హైస్కూలుపండితుడుగా ఉంటూ ఈయన నవ్యాతినవ్యసాహిత్యాలపై అభిరుచి ప్రజలలోను విద్యార్థులలోను కల్గిస్తూ తత్ప్రచారానికీ, తదభివృద్ధికీ సహాయపడుతున్న వ్యక్తి ప్రాచీన, నవ్య, అతినవ్యసాహిత్యాల వికాసానికి కృషి చేస్తున్న యువపండితుడీయన.

## పాటిబండ మాధవశర్మ :

పై నలుగురేకాక ఈకాలానికి యువకులలో అనేకులు భావ కవిత్వపుబాటల నడిచినవా రున్నారని పూర్వమే గమనించినాము. అందులో తమకోసమే తాము వ్రాసుకుని మురిసిపోయినవారే ఎక్కువ మంది. అయితే అధికముగా వ్రాయకపోయినా గ్రంథాలును విరివిగా ప్రచురించకపోయినా ఆర్ద్రితనుబట్టీ, భావబంధురతనుబట్టీ పేర్కొన దగిన నవ్యులలో పాటిబండ మాధవశర్మ (జననం 1911) గారొకడు. తెలుగులో ఎం. ఏ. అనరున్న పట్టాన్ని పొందిన ప్రథములలో ఒకడై, భావకవిత్వంపైన విశేషవ్యాసంగంచేసి, వ్యాసాలువ్రాసి ఖండ కావ్యాలను వ్రాసి భారతీత్యాది పత్రికలలో ప్రచురిస్తూ, ఈయన గణన కెక్కుతున్నాడు. కృష్ణాజిల్లా తేలప్రోలులో 'ఉదయభారతి' అనే గురుకులాన్ని స్థాపించి చాలకాలము తద్వారా యువతీ యువ కులకు సాహిత్య సంప్రదాయాదులను బోధిస్తూ, 'వీణ' అనే ఉత్తమ మాసపత్రికను పెట్టి మూడేండ్లు చక్కగా సంపాదిస్తూ, ఉషా గ్రంథావళిద్వారా నవ్యసాహిత్యాన్ని ప్రచురిస్తూ ఈయన ఉత్తమా దర్శాలుకల సాహిత్యోపజీవి అనిపించుకున్నవాడు. బెజవాడ కళా శాలలో ఇవు డాంధ్రోపన్యాసకుడుగా ఆంధ్రభాషాసేవ చేస్తున్నాడు. ఈయన ఉదాత్తభావసంపత్తికలవాడు. ఈయన వ్రాసిన విరహగోపి- తాళికోటయుద్ధమనే ఖండకావ్యాలు శృంగార వీరరసప్రవణాలై కవి శక్తిని ప్రకటిస్తున్నవి. 'చారుణి' అనే లఘుకావ్యం మనోహరమైన సృష్టి. ఈయన తన హృదయ సౌకుమార్యాన్ని ముఖ గాంభీర్యము చేత కప్పిపుచ్చుకోవడం, తన సాధనానికి ఆకృతి ఇవ్వకపోవడం కారణా లుగా తెరవెనుకే ఉన్నాడవలె. ఏమైనా పైవారితో చేర్చదగిన భావుకు డీయన.

## దేశిరాజు కృష్ణశర్మ :

ఈయన ఈకాలానికి గ్రంధము ప్రకటింపకపోయినా నవ్యకవితా సాధనచేస్తూఉన్న సాహిత్యోత్సాహి. ఈయనగుంటూరుజిల్లా చేబ్రోలు (1912) లో జన్మించినాడు. మొదటినుంచీ సాహితీసమితి ప్రభావ మీయనమీద ఉన్నట్లూ, అందులో ముఖ్యంగా తల్లావజ్ఝల, విశ్వనాథ దేవులపల్లి లీయనకు కవితాగురువు లన్నట్లు, ఈయన రచన లనుబట్టి గ్రహించవచ్చు. ప్రతిభ-భారతీత్యాది పత్రికలలో ఖండ కావ్యాలను, వ్యాసాలను ప్రచురిస్తూ, నరసరావుపేటలో నవ్యకళా పరిషత్తును స్థాపించి యువకు లనేకులను సాహిత్యసాధనలో ప్రోత్స హిస్తూ, అభినివేశముతో ముందుకువచ్చి అనేక గోష్ఠులతో పాల్గొని, ప్రసంగిస్తూ ఈయన ఈకాలానికి నవ్యసాహిత్యవ్యాప్తికి తోడ్పడు తున్న వ్యక్తి. వేషభాషలలో ఈయన అచ్చము భావకవి; వృత్తివలన గుంటూరులో ప్రస్తుతం న్యాయవాది (ఎల్. ఎల్. బి). తత్వదృష్టి ఈయనకు మెండు. అరవిందయోగి ఈయన కాధ్యాత్మిక గురువు. తాత్వికుని గాంభీర్యము - భావుకుని ప్రణయము - అతివాస్తవి కుని భీభత్సము - అభ్యుదయవాది ఆరాటమూ ఈయన రచనలలో గోచరిస్తూ ఉండడమువలన ఈయనను సమన్వయవాది అనవచ్చు.

ఈయన తత్త్వపరమైన దృష్టితో సాహితీసమితి కవుల రచనలను వ్యాఖ్యానించే విధానాన్నిబట్టి సాహిత్య విమర్శకులలో ఈయన కొక ప్రత్యేకస్థానమున్నట్లు చెప్పితీరవలె; వేషభాషలనుబట్టికూడ ఈయన ఒక ప్రత్యేక వ్యక్తి! రాజకీయరంగములో ఈయనకుగల ప్రవేశమును, సాహిత్యరంగములో మూడుతరాలవారితో ఈయనకుగల పరిచయ మునుబట్టి ఈయన సంఘంలోను సాహిత్యంలోను ఒక చక్కని [illegible]

## పుట్టపర్తి నారాయణాచార్య :

నవ్యాంధ్ర కవితావాహినిని రాయలసీమలో పరవళ్ళు త్రొక్కుతూ ప్రవహింపచేసిన భగీరథు డీ యువకవి (జననం 1915). హృదయంలో బడబాగ్ని కలవాడు; స్వభావముచేత అతిస్వతంత్రుడు. ఈతని వాక్కు తీవ్రమైనా మధురమైంది; ఈయనది "ప్రాత క్రొత్త తీరు తియ్యముల మెఱుగులు రెండును సమానముగా మెదిగి తయారైన జీవితము; సంస్కృతము, తెలుగు, ప్రాకృతము, పాళీ, మరాటీ, ఆంగ్లము, హిందీ – ఈభాషాకవుల, విమర్శకుల రాచబాటలలో స్వచ్ఛంద సంచారము చేసిన, చేయుచున్న –



వాడు." హిందీలోని 'రామచరిత మానస్' ను వల్లించుకుంటూ తులసీదాసు కావ్యాలను తన జీవితంలో బాగా అతికిపోయేటట్లు చేసుకున్న నవ్యు డీయన: 'సాక్షాత్కారము' నే ఈతని ఖండకావ్యసంపుటి ఈ విశేషాన్ని స్పష్టం చేస్తున్నది. చిన్నతనమునుంచే గేయాలు – పద్యాలు – వ్యాసాలు వ్రాస్తూ భారతీత్యాది పత్రికలలో ప్రచురిస్తూ సాధనచేస్తూ వచ్చిన ఈయన నవ్యాంధ్ర సాహిత్యాకాశములో ఒక ధృవతారగా ఈ కాలానికి పరిగణింపబడుతున్నాడు. "అగ్నివీణ – పెనుగొండలక్ష్మి – షాజీ – సాక్షాత్కారము – పాద్యము – గాడీవాలా" అన్న వీయన కవితా

హృదయాన్ని వ్యక్తంచేస్తున్న కృతులు*. ప్రబంధనాయికలు ♦– వ్యాససంపుటి – అనే విమర్శ గ్రంథాలీయన బుద్ధిపాటవాన్ని చాటుతున్నవి. ఈయన కృతులలో 'శివతాండవం' అనే గేయకృతి మండనాయమానమైంది; సంగీతసాహిత్య నాట్య సంకేతాలను సలక్షణంగా ఇమిడ్చి రచించిన ఈ కవి ప్రతిభ అద్భుతమైంది; దీన్ని చూచే తల్లావజ్ఝలవారు "ఆధునిక సారస్వతమున యిటువంటి గేయకృతి యింకొకటిలేద"ని అన్నారు. ఆకర్షవంతమైనరూపం కలిగిన ఈ కవి సభలో అభినివేశంతో తన శ్రావ్యకంఠమెత్తి ఈ కావ్యగానం చేస్తూ ఉంటే విశ్వనాథుడే ప్రేక్షకుల మనోవీథులందు సాక్షాత్కరిస్తాడనడంలో అత్యుక్తిలేదు. కవిగా, విమర్శకుడుగానేకాక పండితుడుగా, వక్తగా, తాత్వికుడుగా పేరుగడిస్తున్న ఈయన సర్వతోముఖ ప్రజ్ఞ కలవాడు. అనంతపురం కళాశాలలో కొద్దికాలము, ప్రొద్దుటూరు

---

* సూఫీకవిత, సుమిత్రానందనపంత్, తులసీదాసు, మైథిలీ శరణగుప్త ల జీర్ణం చేసుకొని తచ్ఛాయలనడిచిన ప్రతిభావంతు డీయన. వేదుల, నండూరి, విశ్వనాథల ప్రభావం ఈయన కవితలో కన్పిస్తూ ఉండడం గమనించదగినది; కిన్నెరసాని పాటల తర్వాత ఈయన 'శివతాండవం' ఆ గేయ పద్ధతికే మెరుగులు దిద్దినట్టిదనవలె. పద్యాన్నీ, గేయాన్నీపాడే పద్ధతిలో ఈయన విశ్వనాథను అనుసరిస్తున్న యువకవి.

మాధవరామ శర్మగారి 'అగ్నివీణ'ను గూర్చిన వాక్యాలు చూడండి:

'నారాయణకృతులలో దాగిఉన్న ఆవేశం ఇందులో కనబడుతుంది. భిక్షు వ్యథ, భగ్నప్రేముని బాధ, భావుకుని వేదన పుట్టపర్తిలో ఉన్నవి ... పామరుల ప్రణయము, ఆకలిబాధ, విభవనాశదారిద్ర్యము, వివేకములేని వ్యథ నిరూపణీయములు గనుక వీణ క్వణించి నిరూపించుకొన్నది.'

♦ "నారాయణాచార్యులవాక్కు వణుకులేనిది. స్వతంత్రమగు భావనాబలము; తీవ్రములైన భావములు. అడకువలేని యభిప్రాయములు. అనుభవశూరుల లక్షణము అన్నియు నిందుగలవు. తోచిన పోగడ్తనుగాని తెగడ్తనుగాని వెనుదీయక విసరిచెప్పు నార్జవ మీతనికి గలదు. ... ... భావోద్రేకముతో కావేరివలె ఇతని వాగ్ధార తెగడూకులు దూకుచుండును. ..."

— రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారిపీఠిక

పాఠశాలలో కొంతకాలము పండితుడుగా పనిచేసి, అనేకసభా వేదికల నుంచి గంభీరోపన్యాసాలనిచ్చి, యువహృదయాలలోను, దేశీయుల లోను ఈయన కల్గించిన సాహిత్యచైతన్యమూ, కవితాభిరుచీ ఎంత టిదో గమనిస్తేగాని యీతని ప్రత్యేక వ్యక్తిత్వం అవగతంకాదు. నవ్యసాహిత్యరంగంలో ఈతడు గడించిన స్థానం విశిష్టమైనది.

## కృత్తివాస తీర్థులు:

నవ్యసాహిత్య రంగములో ఈకాలానికి పూర్వమే ప్రవేశించి సాధన చేస్తూఉన్న యువకులలో తీర్థులొక ప్రతిభావంతుడు. ఈయన తల్లావఝ్ఝలవారి కుమారుడు (జననం 1914). సహజముగా సంక్ర మించిన కవితావేశముతోను, పరిశ్రమచేత లభించిన సంస్కృతాం ధ్రాంగ్ల, హిందీ, వంగ, భాషాపరిచయముతోను పరిపుష్టాలైనవి ఈయన రచనలు. ఈతనిదృష్టి తాత్వికవిషయ లగ్నమైనది; హృదయం మధురభావ స్పందం హెచ్చుగాకలది; బుద్ధి పవిత్ర సంప్రదాయాల కోసం, పాండితీవైభవంకోసం ప్రయత్న మొనర్చేది. అందుచేత నే మధురభావ విలసితాలైన 'గోపికాగీతలు' మొదలైన గేయాలు, వేదాంతపరమైన జిజ్ఞాసతోకూడిన వివిధ వ్యాసాలు, ఈతని లేఖిని నుంచి వెలువడినవి. పండిట్‌జీ–హరిచరణుడు – అనుపమాదేవి మొద లైన నవలిక లీతనికున్న ఇతరభాషా పాండిత్యాన్నే కాక, అనువాద సామర్థ్యాన్నికూడా ప్రదర్శించేవిగా ఉన్నవి. ఆంధ్రశిల్పి – ప్రతిభ – భారతీత్యాది పత్రికలద్వారా గేయాలు – నాటికలు – వ్యాసాలు విరివిగా ప్రచురిస్తూ ఈతడు చేసిన, చేస్తూన్న కృషి విస్తార మైనది. శాలా వాఙ్మయాన్ని కూడ పెంపొందిస్తున్నాడు. ఈతడు అలంకారశాస్త్రాన్ని అవగతం చేసుకొని వ్రాసిన విమర్శన వ్యాసాలలో ఈతని "వైష్ణవాలంకారికులు" (ప్రతిభ) మొదలైనవి ఇతని బుద్ధి నైశిత్యాన్ని ప్రదర్శిస్తున్నవి. అనేక సాహిత్య ప్రక్రియలలో సాధన చేస్తున్నవాడైనా, ముఖ్యముగా నాటికా కర్తగా నవ్యులలో విశిష్ట

స్థానాన్ని ఆక్రమిస్తున్నాడు. ఇతడు వ్రాసిన 'భార్యలసమ్మె' అనే నాటిక, వెఱ్ఱితలలు వేస్తూఉన్న అభ్యుదయ మార్గాలను వ్యంగ్యంగా విమర్శిస్తున్నటువంటిదై దేశంలో మంచి ప్రాచుర్యం సంపాదించి కవికి ప్రజలలో ఖ్యాతి నార్జించిపెట్టింది. ఈతని నాటిక లనేకాలలోని కథా వస్తువు ఔత్తరాహుల గాథలలోనివై కవిదృష్టినీ - అభిలాషను వ్యక్తము చేస్తున్నవి. ఆకాశవాణిద్వారా ఇతని నాటికలు శ్రోతృ హృదయాలకు ఆనందంకల్గిస్తూ ఉండడం గమనించదగినది. భారతీయ సంస్కృతినిగూర్చి పరిశ్రమచేసినట్టి 'నాగరికతా విస్తరణము' ద్వారా తెలుగులోకానికి జోష్యుడు మహాశయుని చక్కగా అందించినట్టి ప్రతిష్ఠ ఈతడు గడించుకొన్నాడు. అయితే ప్రాచీనదృష్టి మెండుగా ఉండడము వలన ఇతర యువకవులతో బాటుగా ప్రగతిమార్గాలలో నడవక ప్రాతబడుతున్నాడనవలె. ఏమైనా ఈతడు ఉపాధ్యాయుడుగా రాజ మండ్రి - సికింద్రాబాదు - ఒంగోలు - వేటపాలెం మున్నగుస్థలాలలో విద్యార్థులలో సాహిత్యచైతన్యాన్ని కల్గిస్తూఉన్న సారస్వతసేవకుడని కీర్తి గడిస్తున్నాడు.

## పిల్లలమఱ్ఱి వేంకట హనుమంతరావు *:

ఈ దశకానికి ఐదారు సంవత్సరాలకు ముందే సాహిత్య వ్యావసాయాన్ని ఆరంభించి ప్రక్రియా వైవిధ్యంతో నేటికీ కృషిచేస్తూ, యువ సాహిత్యోపాసకులలో ప్రముఖ స్థానాన్ని స్వీకరించి కీర్తి ప్రతిష్ఠలు గడించుకుంటున్న వారిలో పిల్లలమఱ్ఱి ముఖ్యుడు. గుంటూరు మండలము బ్రాహ్మణకోడూరు గ్రామంలో ప్రసిద్ధమైన వైదిక కుటుంబంలో ఇతడు (31-12-1918) జన్మించినాడు. ప్రతిభా వంతుడైన ఈతడు సికిందరాబాదు మహబూబు కళాశాలలోనూ, హైదరాబాదు నిజాం కళాశాలలోనూ, విద్యాభ్యాసం చేసిన నాడు సన్నిధానం సూర్యనారాయణశాస్త్రిలవారికీ, కురుగంటి సీతారామ

* [illegible]

భట్టాచార్యులవారికీ ప్రియశిష్యుడై వివిధ సాహిత్య మార్గాలలో పయనించి రసిక హృదయ రామణీయకతతోనూ, పాండిత్య ప్రాభవంతోనూ పరిచయం చేకూర్చుకొని సాహిత్యరంగంలో ప్రవేశించినాడు*. తొలికృతులలోని మాధుర్యంతో హైదరాబాదు మండలాలలోని యువకవిలోకాన్ని ఆకర్షించి "సాధన సమితి" ప్రముఖ స్థాపకుడై (1939) కొంతకాలం అధ్యక్షపదవిని నిర్వహించి అవిచ్ఛిన్న ప్రభావంతో సాహిత్యకృషి సాగించినాడు. ఉత్తమ విద్యాభ్యాసంకోసం ఈతడు ఆంధ్ర విశ్వవిద్యాలయములో ప్రవేశించి♦ ప్రథమ శ్రేణిలో ఎం. ఏ. పట్టభద్రుడైనాడు (1943). విశ్వవిద్యాలయ విద్యార్థిగా ఉంటూ ఉన్నప్పుడు కూడా ఈ కవికుమారుడు వాల్తేరులో యువకులను ఆ నేతలను ఆకర్షించిసాధన సమితికి శాఖ నొకదానిని కల్పించి 'ప్రత్యూష' (లిఖిత మాస పత్రిక) ద్వారా సభ్యుల రచనలను సంపాదించి ప్రకటించినాడు (1940-43).


పిల్లలమఱ్ఱి హనుమంతరావు

విద్యాభ్యాసం పూర్తి ఐన తర్వాత కొద్దికాలము హైదరాబాదు ప్రభుత్వశాఖకు ద్విభాషిగానూ, పిమ్మట పదెనిమిది సంవత్సరాలుగా గుంటూరు హిందూకళాశాలలో ఆంధ్రోపన్యాసకుడుగానూ ఉంటూ సాహిత్యంలో వివిధ విశిష్ట మార్గాలను అన్వేషిస్తూ ఈతడు విశేష కృషి చేస్తున్నాడు. గేయం, పద్యం, నాటిక, కథ, వ్యాసం, కావ్య విమర్శ, గ్రంథవిమర్శ, రేడియో ప్రసంగం, లేఖలు - మొదలైన

* సికిందరాబాదులో జమ్మలమడక సోదరుల (సూర్యచంద్రుల) మైత్రీ, సాహచర్యమూ ఆనాడు అంతర్వాహినిగా ఉన్న ఈతనికవితా నిర్ఝరిణికి త్రోవలు కల్పించినవి.

♦ ఆంధ్ర విశ్వవిద్యాలయములోని ఈయన గురువులైన పింగళి - అబ్బూరి కవుల ప్రభావమీతని హృదయముమీద, గంటి - మల్లాది - వఝ్ఝల - దువ్వూరి పండితుల ప్రభావమీతని బుద్ధికైనా హెచ్చుగాపడి ఈతనిని నవ్యకవిగాను, యువపండితుని గాను తీర్చి దిద్దిన వనుకొం.

సమస్త సాహిత్యశాఖల్లో నడిచిన ఈతని లేఖిని ఉదాత్త వస్తువునూ కమనీయ కళావిన్యాసాన్నీ స్వాయత్తం చేసుకున్నది. ఈతని రచనలలో ప్రామాణికత సర్వే సర్వత్ర గోచరిస్తుంది. ప్రాచీనమూ, అధునాతనమూ అయిన సాహిత్య రసనల స్వరూప స్వభావాలను ఉత్తమ కవితావీథులలో విహరించే ఈతని సరససాహితీ హృదయం అందుకున్నది; కీర్తి ప్రతిష్ఠలను ఆర్జించి ఇస్తున్నది. కవి భ్రమరమై ప్రథమతః 'మధుకణములు'* (1940) సేకరించి సాహిత్య సరస్వతిని ఇతడు ఉపాసించినాడు. 'రవీంద్రుని కవితాత్మ పుష్పసౌరభమువలె ప్రతిపదంలోనూ వాసించే' "చిత్ర"ను 'అమూల్య ప్రతిబింబం'గా అనువదించి (1941) అందించినా డీతడు. కథకుడుగా ఈతడు అనంత కథానికా వైవిధ్యంతో ఒప్పుతున్న 'వెలుగు నీడలు' (1942) ప్రచురించి ఉత్తమ కథకుల్లో ఒకడని పేరు పొందినాడు. రూపక రచయితగా 'వత్సల' (1949) 'దీపకళిక', వంటి ప్రౌఢమైన ఏకాంకికల నిర్మించినాడు. ఇవి ప్రదర్శితములై ప్రేక్షకులనూ, ఆకాశవాణిముఖాన వినబడుతూ శ్రోతలనూ ఆనందపరుస్తున్నవి.

ఈతనికి విశిష్ట స్థానాన్ని కల్పించి ఖ్యాతిగడించి పెట్టినది సాహిత్యవిమర్శ. ఆంధ్రసాహిత్యాని కున్న ఈ లోటును గమనించి ప్రాక్పశ్చిమ విమర్శనా మార్గాలను అవలోడనం చేసి సంపాదించుకున్న యోగ్యతతో 'కవి – కావ్య ' విమర్శకూ' ప్రాచీన – అధునాతన కావ్యవిమర్శకూ పూనుకొని ♦ ఈతడు విశేష సామర్థ్యంతో ఆధికారిక విమర్శను నిర్వహించినాడు. నేడు ఆంధ్రసాహిత్య లోకంలో విమర్శకశేఖరుడై అగ్రమైన తన ప్రథమ తాంబూలాన్ని అందుకుంటున్నాడు‡. "సాహిత్య

---

*"అన్ని ఖండకావ్యాలు, నవ్యకవిత్వానికి చెందిన క్రొత్త పోకడలకు సంబంధించినవే! వీరిది నడకరాని నాటుకవిత్వం కాదు. హృదయంగల కవి...", -కృష్ణాపత్రిక.

♦ ఈయన కలానికి రెండు వైపులా పాళీలున్నవి. —ఆంధ్రశిల్పి.

‡ నవ్యాంధ్ర సాహిత్య చరిత్రకారుడు గాకూడ గణన కెక్కుతున్నాడు.

సమాలోచనము*" (1946) –"సాహిత్యసంపద"♦ (1949)–"సాహిత్య సమీక్ష" (1950) ఈ శ్రేణికి చెందిన ఇతని ముద్రిత గ్రంథపరంపర. "పంచవటిపర్యాలోకనము" (1944) లో ఒక ఖండకావ్యం ఎలా విమర్శితము కావలెనో ఈతడు సహృదయ దృష్టితో నిరూపించి చూపినాడు. 'నిశితబుద్ధి అయిన ఇతని విమర్శనలు విషయ వివరణలో విశదములై భావోత్తేజకములై ఉన్నవి' (శివశంకరశాస్త్రి) : రసికత, భావుకత, విన్యాసపరిజ్ఞానము, సమన్వయశక్తి, సరసహృదయము – మొదలైన ఉత్తమ విమర్శక లక్షణాలన్నీ ఇతనిలో రూపొందినవనడం అతిశయోక్తి కానేరదు.

'పిల్లలమర్రి' ఒక సాహిత్యకేంద్రం. నేటి యువక సాహిత్య లోకంలో ఈతడొక ప్రత్యేక వ్యక్తి; సహృదయుడు – భావుకుడు, కవి‡, కథకుడు, నాటికాకారుడు, విమర్శకుడు, సంపాదకుడు*, అధ్యాపకుడు, వక్త. వక్తగా ఈతడు ఉదాత్త వస్తువుతోనూ, ఆధికారిక ప్రవచనంతోనూ, శ్రావ్య కంఠంతోనూ,

---

* 'వాస్తవమున కిది లక్ష్యలక్షణ సమన్వితమైన ఆంధ్రసాహిత్య చరిత్రమన్న అత్యుక్తి కాదు.' —మల్లంపల్లి వారి ప్రవేశిక.

♦ "Sahitya Sampada'is charactarised dy a wise selection of themes and an attractive presentation." —Dr. C. R. Reddi.

'పదునాలవ శతాబ్దము మొదలు నేటి వఱకుగల మహాకవులలో పదునొకండుగుర కావ్యరచన యందలి మఱుగు మెఱుగులను ఇందు వివరించినారు. శ్రోత శ్రోత్రోవలు రెంటియెడను సమానమైన సహానుభూతిని అభిమానమును వెలువరించిన ... ఇది యొక అఖండ గ్రంథమేయై తెలుగులకు కావ్యరసానుభవమునకు చక్కని మార్గదర్శకమై యున్నది.' —రాళ్ళపల్లివారు.

‡ ఆధునిక గేయరచయితలలో ఈతడు ఉత్తమ శ్రేణికి చెందిన వాడనవలె. ఈ కవికుమారుడు వ్రాసిన శారదాస్తుతి - కాపుపాటలు – ఆంధ్రాభ్యుదయం మొదలైన గేయాలు ప్రసిద్ధాలు.

* ఆంధ్ర రిపబ్లిక్ అనే వారపత్రికను కొందరిసాయంతో గుంటూరునుండి నిర్వహించినాడు కొంతకాలం.

ఉన్నతమూర్తితోనూ, సభ్యులను ఆకర్షించి ఆనందింప జేస్తున్నాడు. భారతి, ప్రతిభ, ఆంధ్రశిల్పి, తెలుగుతల్లి, వాణి - మొదలైన పత్రికలన్నిటిలో తరుచుగా రచనలను ప్రకటిస్తూ యువకలోకానికి కళాశాలలోనూ, బాహ్యప్రపంచములోనూ వెనుక నొక వెలుగై చైతన్యాన్ని ఇచ్చి ప్రోత్సహించి, అనేకసమాజాలకు ‡ కారణభూతుడై ప్రవర్తిస్తూ, ఆకాశవాణిముఖంగా సాహిత్య సద్గోష్ఠులలో పాల్గొంటూ సాహిత్య సంచలనం కల్గిస్తున్న సాహిత్యాచార్యుడు. ఈతడిచ్చిన వెలుగును అందుకొని ఉత్తేజితులై సాహిత్య దీపాల వెలిగిస్తున్న యువక కవి లోకం క్రమశః వింతకాంతులతో విశాలాంధ్ర సాహిత్యవీధుల అలంకరిస్తున్నది. ఇతని 'శారదాపీఠం' ఒక శారదాపీఠం! ఇతడే ఒక శారదాపీఠం!!

## వావిలాల సోమయాజులు :

ఈ కాలానికి పూర్వంనుంచే (1935) భారతి, ప్రతిభ, ప్రజామిత్ర - ఇత్యాది పత్రికలముఖాన సర్వతోముఖంగా సాహిత్యకృషి చేస్తూఉన్న ఈ యువకవి ఉత్తమ ప్రతిభావంతుడు. గుంటూరు మండలంలోని విప్రులపల్లె అగ్రహారంలో (18-1-1918) జన్మించినాడు. మాతాపితృవంశాలు రెండూ యజన యాజనా శీలంతో బహుతరాలుగా ప్రవర్తిల్లిన ఉత్తమ వైదిక కుటుంబాలు. తత్ఫలితంగా ఈతనికి సనాతన సంప్రదాయజ్ఞత కొంత అలవడింది. ఈతడు యౌవనారంభం నుంచీ ఉత్తమ భావుకుడు, కళాశీలి, శైలూషుడు ఈతని వ్యక్తిత్వాన్ని గమనించి దోహదక్రియలు చేసి ప్రథమదశలో కొంత ప్రభావాన్ని నెరపిన పెద్దలు శివశంకరశాస్త్రి, మారేమండ రామారావుగారలు. తెలుగుభాషను అభిమానశాఖగా స్వీకరించి 1937 లో బి. ఏ., పరీక్షలో పట్టభద్రుడైనాడని అనడం ఇతని వ్యుత్పన్నతకు

---

‡ నవ్యసాహిత్యపరిషత్తు, సరస సారస్వతసమితి, ఆంధ్రసాహిత్యమండలి, కవితావనం, జ్యోత్స్నా సమితి మొదలైనవి.

ఒక కాలబద్ధ కానేరదు. ఇతని వివిధ సాహిత్యశాఖా వ్యవసాయాన్ని పరిశీలిస్తే వయసుకుమించి పరిశ్రమచేసిన ప్రౌఢ యువకుడని తట్టి


వాపిలాల సోమయాజులు

తీరుతుంది. ప్రాచీన ధోరణినీ, నవ్యతనీ 'సమన్వయా'లో సమ్మేళనం చేసుకున్న పాండిత్య స్ఫోరకమైన రసజ్ఞత* ఇతని కావ్యరచనలో సర్వత్ర గోచరిస్తుంది. 'భారత జయఘంటా', 'ఆపకండీరథము', మొదలైన గేయాలూ, 'సౌగంధిక', 'సాక్షాత్కారము' లవంటి గద్య పద్య నాటికలూ రేడియో ముఖంగా ప్రాచుర్యాన్ని పొందుతూ ఈతనికి కీర్తినిగడించి పెడుతున్నవి. పల్నాటివీరగాధను "నాయకురాలు" అనే నామంతో రూపకంగా రచించి గుంటూరు నాట్యసమితి వారిచే, ఆంధ్రదేశంలోని వివిధప్రాంతాలలో ఆడిస్తూ, ఉత్తమ నాటక

---

* ఈశ్వరుని ఉద్దేశించి ధూర్జటి పలికినట్లుగా 'మహాత్మ్యం' అనే ఖండ కావ్యంలో ఈ కవి కుమారుడు చెప్పిన ఈ వాక్యాలు హృదయంగమభావాలకూ, ఆర్ద్రితోద్వేగాలకూ నిదర్శనాలు ; ఉదాహరణాలుగా రెండు—

తనువు న్నిత్యముగా నొనర్చు మిలపై దానుండనై కొల్తుని
న్ననవచ్ఛిన్నతకాళహస్తి, నటుకాదా జన్మమే లేని నీ
గణమందొక్కనిగా గ్రహింపగదె - ఆ కైలాససంధ్యానట
ద్గణ మందొక్కడనై రచించెదను భర్గా నృత్యగీతమ్ములన్.

శాకాశ జన్మమిచ్చి భువి నన్జనియింపగనిమ్ము స్వామి! నీ
వాకిట బిల్వ వృక్షమటు వత్సలతన్ - దినమున్ దినమ్ము ప
త్రాకృతితో త్వదీయ పదపల్లకవీధి నలంకరింతు ఛా
యాశమనీయ దేహమున హ్లాదము కూర్చెద నేత్రపంక్తికిన్.

రచయితగా విఖ్యాతి గడించుకుంటున్నా డీతడు*. ఇతడు అభిమాన సాహిత్యశాఖగా "వ్యాసాన్ని" స్వీకరించినట్లు కనిపిస్తున్నది†. కథానిక, నవలాది ప్రక్రియలలోనూ ఇతడు తన ప్రత్యేకతను కాపాడుకుంటూ రచన సాగిస్తున్నాడు. రచనలలో 'ప్రాత- క్రొత్తలమేలు కలయిక' విషయవైవిధ్యము, బాహు గ్రంథసారము హెచ్చుగా ఉంటూ, యువ రచయితలలో ఇతనిని విశిష్టునిగా గణించేటట్లు చేస్తున్నవి. స్ఫురద్రూపమూ, శ్రావ్యకంఠమూ, ఆకర్షణీయమైన ఉపన్యాసధోరణీ కలిగి ఈయన నేటి వక్తలలో గణన కెక్కుతూ ఉండటం గమనింప దగ్గ విషయం. సాహితీసమితి యువసభ్యులలో ఈతడు మంచి భవితవ్యం కలవాడు. గుంటూరు శారదానికేతనం ప్రాచ్యభాషా కళాశాలకు షుమారు ఎనిమిది సంవత్సరాలు ప్రధానాధ్యాపకుడుగా వ్యవహరించి యువతీ హృదయాలలో సాహిత్య స్పందాన్ని కల్గించి, ప్రస్తుతం ఆపట్టణం లోనే హిందూకళాశాలలో పండితుడై అనేక యువసాహిత్యసాధకులకు ప్రోత్సాహమిస్తూఉన్న ఈ వ్యక్తి ఒకచిన్న విజ్ఞానకేంద్రమే అనవలె!

---

* "ఇది చదువుకోటానికెంత ఆకర్షకంగా ఉందో, ప్రదర్శించడానికి కూడా అంత రక్తి కట్టుతుంది. మనకీమధ్య వెలువడిన నాటకాలలో ఇది ఒక గొప్పనాటకంగా మనం లెక్కించుకోవచ్చు ... ... పాత్రపోషణలో కొన్ని ప్రత్యేకతలు చూపించారు ... శ్రీ శివశంకరశాస్త్రిగారికి అంకితమిస్తూ వ్రాసిన పద్యాలు, ఇంకా కొన్ని పాటలూ చక్కని ఖండకావ్యాలుగా సారస్వతంలోకి చేరగలవు. ... "

— సూరంపూడి భాస్కరరావు: 'ఆంధ్రశిల్పి'

† 'పుష్పలోకం', 'భ్రమరాన్వేషణము', 'సాహిత్యంలో చంద్రుడు', 'మలయా నిలుడు' మొదలైన వ్యాసాలు (భారతి) ఆంధ్రసాహిత్యంలో వ్యాససాహిత్యానికి నూతనాలంకారాలు. ఇతని 'స్తోత్రపాఠం' 'శత్రువులు - శత్రుత్వం' వంటి (ఆంధ్ర వారపత్రిక) వ్యాసాలూ కులాసా ధోరణిలో నడిచినా వ్యక్తి వైశిష్ట్యాన్ని గుర్తింప చేస్తున్నవి. చారిత్రక దృష్టితో వ్రాసిన 'ఆంధ్రులూ - సంగీతనాట్యాలు', వంటి వ్యాసాలు - తాత్వికదృష్టితో నడిచిన 'శబ్దము - శబ్దసంపద', 'గణపతి' 'నవ్వు' 'నిద్ర' వంటి వ్యాసాలు విచిత్రమార్గాలలో నడిచినవి. వివాహమూ, మతమూ, ఇతనిని ఆకర్షించటంవల్ల మతసాంఘిక వ్యాసాలు కొన్ని ఈ రచయిత ప్రచురించినాడు. సాహిత్య విమర్శకు "దీక్షిత దుహిత విమర్శ" ఒక చక్కని ఉదాహరణ. ఇతడు దక్షిణదేశ సాహిత్యమును గురించి విశేష పరిశ్రమచేసి ప్రచురించిన వ్యాసాలు (భారతి) ప్రామాణికతను తెల్పుతున్నవి. పరిశోధకుడుగా కూడ కొంత కృషి చేస్తున్న యువపండితుడు.

## పైడిపాటి విద్వాన్ :

నవ్యసాహిత్య సాధనచేస్తున్న యువకులలో ఈయన గొప్ప ఉత్సాహవంతుడు. కృష్ణాజిల్లా శాయపురానికి చెందినవాడై (జననం 22-2-1918) స్కూలు ఫైనలు, విద్వాన్ పరీక్షలను ఇచ్చినాడు. చిన్నతనంలోనే అవధానాలు చేసి కొంత ఉబలాటమూ ఉవజ్ఞా చూపెట్టినాడు; నవ్యకవిత్వం పైన ప్రీతికలిగి గేయసాహితిని తూణీరం(1941)- దేశం (1942) - దశావతారాలు (1947) - జ్యోతిస్తరంగిణి - అన్న సంపుటాలద్వారా పెంపొందించిన నవ్యుడు. వీటిలో కవికున్న భావోద్వేగమూ, ఆంధ్రాభిమానమూ స్పష్టముగా కన్పిస్తవి. అష్టపదులధోరణి అలవరుచుకుని దశావతారాలను * తెలుగులో పట్టించిన ఈయన ప్రతిభ అభినందింపదగినది. ఆధునిక గేయరచయితలలో ఈయనకొక స్థానమున్నది.



---

* ఉదాహరణ కొక్కటి చూడండి :

జృంభిత మునిజన శాపరూపులై
కుంభినిపై కనకాక్ష కశిపులై
గండు మిగిలి, కనకాక్షుడు వరుణుని
చెండి, రసాతలమేగి, బంతిగా
నేలమోయు లోలికిటిని చివ్వకై
తూలి పిలంవ ; నతి ఘుర్ఘురలీల వెను
కోలకత్తులను చీరి రాక్షసుని
ధారుణీ ధరోద్ధరణ మొనర్చిన
వరాహశిఖరా !

నృత్యయోగ్యాలైన గేయాల్ని వ్రాస్తూ ఈయన మంచి ప్రచారములోకి వస్తున్నాడు*. నీలం (1942)-అనే కథలసంపుటీ, ఆంధ్ర శ్రీ ♦ (1944) – అనే ఖండకావ్యసంపుటీ, ఉషాసుందరి † (1946) అనే నాటకం, 'కవిరాజు' అనే (జన్మభూమి పత్రికలో వరుసగా ప్రచురితమైన) నవల, రామలింగేశ్వరశతకము, (1947) 'శతపత్ర' మనే ధ్వని ప్రధానమైన ఖండికా సముచ్చయమూ – ఈకవి సాధనము బహుముఖమైనదని వ్యక్తపరుస్తున్నవి. ఈయన స్వతంత్రుడు. కీర్తికాముడు. అతి నవ్యధోరణిని తీవ్రంగా అపహసిస్తూ, అధిక్షేపిస్తూ గేయాలు వ్రాసినా డీయన. హృదయంలోని ఉద్వేగాన్ని ధూకుడునూ కలంలో కన్పింప జేయడంలో ఈయన శక్తిమంతుడు–నవ్యసాహిత్యరంగములో ఈయువకవి ఈకాలానికి అలజడి కల్గించిన సాధకులలో ఒకడనిమాత్రం గుర్తింపవలె.

## సంపత్:

నవ్య సాహిత్యరంగములోకి పైవారి తర్వాత వచ్చిన వాడైనప్పటికీ, చిత్రకవితా రచనలను చేయడాన్నిబట్టి శ్రీ. శ్రీ తో చేర్చదగినవాడై నప్పటికీ ఈతడిక్కడే ప్రస్తావింపబడడంలో కారణమేమిటే

---

* 'త్రిలింగదేశం మనదేనోయ్' అనే ఆంధ్ర జాతీయగీతమని ఒకటి వ్రాసి మంచి ప్రచారము గావించినాడు.

♦ "ఇందు దేశకాలపాత్రోచితమైన భాష ప్రయోగింపబడినది. రామదాసు తానీషా సంభాషణాదికము వినినప్పుడు నాకు దిట్టకవి నారాయణకవి వ్రాసిన చరిత్ర జ్ఞప్తికివచ్చి మిక్కిలి యానందము కలిగినది, మరియు డొక్కావారి చరిత్రమును వినుచున్నప్పుడు నేను తన్మయుడనైతినను టతిశయోక్తి కాదు."

— శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి.

† "మీ కవితాశకలం చిందుల్లోని భావగర్భిత ప్రౌఢాంగనా వ్యంగ్యవిలాస విన్యాసాన్ని అరమోడ్పు కన్నులతో అర్థం చేసుకొంటూ ఆనందిస్తున్నాను."—స్థానం

అంటే-ప్రాచీనుల పాండితిని, నవ్యుల భావుకతను, అభ్యుదయవాదుల ఆవేదనమును కల్గిన విశిష్టవ్యక్తి కావడమే, 'సంపత్' అచ్చమైన కవితా హృదయం, గుచ్చుకునే వాక్పటిమ కలవాడు. మైసూరు రాష్ట్రములోని వెంకటాపురంలో (20-10 1917) జన్మించినాడు. పుట్టినది పండితవంశం కావడంవల్ల సంస్కృతాంధ్రాలలో ప్రవేశము సహజముగా చిన్ననాటనే కల్గిన దీయనకు. సరిహద్దులలో నివాసం చేయడం కారణంగా తమిళ కన్నడాలు గ్రహించినాడు. అనంతపురం లోనే చిన్ననాటినుంచి బి. ఏ., దాకా విద్యాభ్యాసము చేసినాడు; అభిమానాన్ని పురస్కరించుకొని తెలుగు ఎం. ఏ., అయినాడు; ఉద్యోగార్థము బి ఇడి కూడ చేరింది దాని ప్రక్కన. ఈతని రచనలు భారతీత్యాది పత్రికలలో ప్రచురితమౌతూ మంచి ప్రతిభావంతుడని నిరూపిస్తున్నవి. విశ్వనాథ - దేవులపల్లి - శ్రీ శ్రీ ల వెనుక చకా చకా సాహిత్య వీధులలో నడుస్తూ, వారినిమీరి నడవవలెననే ప్రయత్నం కలవాడులా కన్పిస్తాడు. భాషలో విశ్వనాథ- భావములో దేవులపల్లి - రచనలో శ్రీ శ్రీ - ఇతనిని ఆకర్షించి నారననలె. ఈ ముప్పురు కలసిన మూర్తే 'సంపత్'. కవితాకన్యను గిరగిర వివిధ ఛందోమార్గాలలో త్రిప్పుతూ చూపరులను, పాఠకులను దిగ్భ్రాంతు లను చెయ్యజాలిన ప్రజ్ఞకలవా డీతడు. 'విశ్వకవి వాల్మీకి' 'కైలాసగంగ' నడిచిన పద్ధతిని - వానిలోని కవి హృదయాన్ని-భాష లోని పాటవాన్ని తిలకిస్తే ఈతనికితడే సాటి అనిపిస్తాడు; గేయం - పద్యం - కథ - నవల - ఈ ప్రక్రియల నన్నిటినీ సాధించినాడు. కాకినాడ - రాజమండ్రి - అనంతపురము (ప్రస్తుతం) కళాశాలలలోని విద్యార్థుల కాంధ్రోపన్యాసకుడై, నిరంతరమూ గోష్ఠివలన సానలు తీరుతున్న ఈతని కవితాప్రతిభ దినదినానికి నవనవోన్మేషం పొందు తున్నట్లు కన్పిస్తుంది. నవ్యసాహిత్య వీధులలోని మూడుమార్గాల లోను దర్జాగా దర్పంతో నడవడానికి తగిన స్తోమతున్నట్లు ఈయన రచనలే చెప్పగలవు. సాహిత్యములోని ప్రాచీన, నవ్య, అతి నవ్య ధోరణులను తనలో ఇముడ్చుతున్న 'సంపత్' ఎన్నదగిన నవ్యుడు.

పై నుల్లేఖించిన యువకులే కాక ఈకాలాని కెందరెందరో కృషి చేస్తూ నవ్యసాహిత్య వ్యాప్తికి కారణభూతులయిన వారున్నారని పూర్వమే గమనించినాము. అయితే వారందరిలోను పై నుల్లేఖించిన వారిలో గల సర్వతోముఖ ప్రజ్ఞ కన్పడదు. ప్రథమ ద్వితీయ శ్రేణులకు జెందిన నవ్యులలో ఏ నలుగురైదుగురో తప్ప చాలవరకందరూ సృజన శక్తి కలవారేగాని విమర్శకులు కారు. కాని యీ పైన ఉల్లేఖించిన యువబృందములో ఇంచుమించు అందరూ అటు కావ్యస్రష్టలు, ఇటు విమర్శకోత్తములును; వివిధసాహిత్య ప్రక్రియాసాధనవల్ల, నక్షత్రత్వ ప్రజ్ఞ కలిగి ఉండడంవల్ల, తదితర యువ సాహిత్యకులకన్నా పైవారు నవ్యసాహితీ చరిత్రలో ప్రత్యేకస్థానమును గడించుకొంటున్నారు.

ఇక ఈకాలానికి వెనకముందుగా (1940-45) జరుగుతున్న నవ్యాంధ్ర సాహిత్య వ్యవసాయాన్ని కొంత అవలోకించుదాము:

## సాహిత్య వ్యవసాయ సమీక్ష*:

1938 ప్రాంతానికే కొత్తనీరు బాగా వచ్చినది, శ్రీ శ్రీ-ఉమా మహేశ్‌లు ఈ నీటికింద కొత్తవ్యవసాయం ప్రారంభించారు. అతి వాస్తవికరచనలన్నారు. కవి పిచ్చివానితో సమానమన్నారు. కవిత్వం పిచ్చిమాటల్లాగా సమన్వయం ఉండనక్కర లేదన్నారు. ఇంకేమి? ఈ పద్ధతి తేలికచేసింది కవిత్వాన్ని. ఉపపత్తి లేని యువకు లంతా వెఱ్ఱికూతలు కూయడం ప్రారంభించినారు. అదేమిట్రా అంటే 'పొయట్రీ' అన్నారు. పండితులు లెక్క-చేయలేదు. నవ్యకవులు మనల్ని తలదన్నారేమూ అని విస్తుబోతున్నారు. నోటికొచ్చినట్లు వాగడం కవిత్వమై పోతున్నది!

కొత్తనీళ్ళు ప్రాతనీళ్ళను పారదోలాలనే భావం రేకెత్తింది. కొందరిలో అందుకని దోషాల్ని ఎన్నబూనారు. ప్రబంధాలు వీరిదూష

* 1945 లో "మీజాన్" పత్రికలో నేను వ్రాసిన వ్యాసమునే యిక్కడ ప్రచురించుచున్నాను. —పి. వేం. హ.

ణకు గురిఅయినై. సంస్కృత పదబంధాలు శృంగార రసాధిక్యము వీరి ఏవగింపునకు కారణాలు. పైగా ప్రజాజీవితం పూర్వకవిత్వంలో ప్రతి ఫలించటంలేదనే దోషాన్ని ఆరోపించినారు. ఈ యేవగింపంతావచ్చి వచ్చి సంస్కృతంమీాద విరుచుకొని పడింది. తాపీ ధర్మారావుగారు దీనికి నాయకుడు. పూర్వ సాహిత్యంమీాద తిరుగుబాటు తెస్తున్నాడు. సుకుమారులైనట్టి కష్టపడడానికి ఓపికా, శక్తీలేనట్టి విద్యార్థులలోని అలసత్వాన్ని ఎక్కువ చేసిందీ వాదం! ఇంకేముంది! ఎటు చూచినా విమర్శలు, తేలికరచన లెక్కువైనవి.

ఈ విధంగా సాహిత్యవృష్టిలో మార్పు వచ్చినది. ఈ ఉద్యమాలద్వారా చేసినకృషి పరిణామంలో విషమంగాఆకారందాల్చింది. ఈ విపరీత ఫలసాయానికి పండితులు కలవరపాటుచెందుతూనే ఉన్నారు. వాళ్ళలో జరుగుతున్న సంఘర్షణ ఫలితంగా కొంత కార్యం జరిగింది. భాషాసంప్రదాయాల్ని భద్రపరచవలసిన బాధ్యత వీరు గుర్తించారు. సభల్లో ఢీకొన్నంత మాత్రాన (సమాన ఉపపత్తి ఉన్నది గనకనా) ఏమీా ప్రయోజనం లేదనుకున్నారు మర్యాదా మాటా తెలియనివారితో జగడ మెందుకనుకున్నారు. కాబోలు గ్రంథ రచన సాగించారు "సులభీకృత చంద్రికళ" అని నెల్లూరునుంచి ఒకరు, 'నవరసగంగాధర'మని జమ్మలమడకవారు, 'తత్సమ చంద్రిక,' "నరస భూపాలీయ వ్యాఖ్య" లంటూ సన్నిధానంవారు, 'శారదా గమనం' అంటూ అప్పల జోగన్న శాస్త్రిగారు, 'ధ్వన్యాలోకానువాదం' భాగవతుల కుటుంబశాస్త్రి, పంతుల లక్ష్మీనారాయణశాస్త్రి వేదాల తిరువేంగళాచార్యులు గారలు – 'ప్రతాపరుద్రీయ యశోభూషణం," 'అలంకార వసంతం' అని చలమచర్ల రంగాచార్యులుగారు కృషిచేసి గ్రంథాల్ని తెలుగులోకి అనువదించినారు. ఇదొకవిధంగా సాహిత్య సంప్రదాయానికి పాటుపడ్డారు. లాక్షణికభాషా ప్రచారానికి పండితులింకా పాటుపడుతూనే ఉన్నారు. వ్యావహారిక భాషవల్ల మాండలిక కాలవరోధం కల్గించుచున్నందు వలన దానిపై కొంత వైముఖ్యం ఏర్పడుతున్నది.

ఇలా ఉంటూ ఉంటే మనం ఎంతసేపూ తెలుగులో తర్జన భర్జనలు చేసుకుంటున్నాం; దీనితో కాలయాపనమౌతున్నది; ఆంధ్రే తరులకు మనల్నిగురించి చెప్పవలసిన బాధ్యత ఉన్నదని గుర్తించారు కొందరు. నిర్మాణ కార్యక్రమం కావాలి కాని ఊరికే గాలి పోగు చేయడంలో ప్రయోజనం లేదనుకున్నారు. మతసామరస్యం లేక నే మన భారత దేశమిలా ఉన్నదనీ, పరస్పరావగాహనకు అవకాశాలు ఏర్పరుస్తేగాని ప్రయోజనంలేదనీ గుర్తించినారు. ఈ అభిప్రాయాలు, "హైదరాబాదాంధ్ర సాహిత్య పరిషత్తు"గా రూపుతాల్చినవి. విమర్శనకు పరిశోధనకు మంచితావిచ్చిందిది. నిజాముచరిత్ర వచ్చింది. ఆంధ్రవాఙ్మయ చరిత్ర ఆంగ్లంలో కురుగంటివారు ప్రచురించినారు. పి.ఇ.యన్ వారుకూడా ఈకాలానికే డా. పి టి. రాజుగారిచేత తెలుగు వాఙ్మయంమీద ఆంగ్లంలో చిన్నగ్రంథం వ్రాయించి ప్రచురించినారు. ఆధునికాంధ్ర వాఙ్మయాన్నంతా పోగుచేసి దానికి నిర్దిష్టాకారాన్నిచ్చి చరిత్రగా గ్రథించడం ఒకర్రివలన అయ్యేపనికాదు. కురుగంటివారు నిర్మొహమాటంగావిమర్శలురాకపోవడంవలనసాహిత్యలోకంతప్పుదోవ ల్లోకి పోతుందని "నవ్యాంధ్ర సాహిత్యవీథుల్లో" ఋజువు పరచినారు. జంకులేని విమర్శ తెలుగులోకంలో ఇంకా నిర్మింపబడాల్సే ఉన్నది. 'నేటికవిత్వం' మని సుందరాచారిగారి చిన్నప్రచురణ వచ్చింది. మత సామరస్యం కూరుస్తూ చాలకృషిచేసి 'ఖుర్ అన్ షరీఫ్'కు వ్యాఖ్యవ్రాసి నారు ఖాసింఖాన్‌గారు; వేమన తత్వాన్ని ఉర్దూలో ప్రొఫెసరు టోపాచే వ్రాయించారు. తలలన్నీ ఒక చోటకూడని ఈదుస్థితిలో భారతదేశానికిలాంటి గ్రంథాలు ఐక్యత కూర్చవచ్చు. మత వైష మ్యాల్ని తొలగించుకోవాల్సినకాలం కదా యిది! కథానికలు తెలు గులో కుప్పతిప్పలుగా వస్తున్నాయి. ఇందుకు లక్షణాదికం మథించిన గ్రంథం కావాల్సిన కొరత కొంతవరకు తీర్చారు, ఖాన్‌గారు తా మొక గ్రంథం ప్రకటించి; ఆంధ్రలోకాన్నంతా ఆకట్టుకొని, విజ్ఞాన సర్వస్వం (Encyclopedia) తెలుగులో వ్రాయించ ప్రయత్నించినా రీ పరిషత్తువారు, కూగంటి బాపినీడుగారు అక్షరజ్ఞానమున్న

ఆంధ్రుడికి ఉపయోగపడేందుకు "ఆంధ్ర సర్వస్వము"ని వివిధాంశాల మీద ప్రముఖులచేత వ్యాసాలను వ్రాయించి సంపాదించినాడు. ఈ కృషి యెన్నదగినదే.

గాలి కబుర్లతో ఏమీ ప్రయోజనం లేదనీ, ఆగాలే విజ్ఞానం అయితే సార్థకం అవుతుందనే ఉద్దేశంతో ప్రతాపరెడ్డి, బిదురు శేషయ్య, రంగాచార్యులు, భాస్కరభొట్ల, బి. వి. రమణరావు, ఇల్లిందల సీతారామరావు మొదలైన సాహితీప్రియులు "విజ్ఞానవర్ధినీ పరిషత్తు"ను స్థాపించి సేవజేస్తున్నారు. "నవ్యాంధ్ర సాహిత్యవీధులు" కారణంగా సాహితీ సమితి తిరిగి సంచలించడం ప్రారంభించింది. "నిజాం రాష్ట్రాంధ్ర సారస్వత పరిషత్తు" తత్కారణానే ప్రారంభ మైనట్లు పత్రికలు గోలకొండ చెప్పుతున్నాయి. ఏతత్సంస్థ మూలంగా కొంత వాఙ్మయ వ్యవసాయం జరుగుతూ వచ్చింది. ఆంధ్రా ణంలో ఆంధ్రభాషాభిముఖ్యము అలవరచాల్సిన అవసరం చాలా ఉన్నది. దానికోసం జిల్లాప్రతినిధులద్వారా యీ పరిషత్తు మంచి ప్రచారం చేస్తూఉన్నది. ఖండవల్లి బాలేందుశేఖరం, బిదురు శేషయ్య, కాళోజీ నారాయణరావు ప్రభృతులు మంచికృషి జేస్తు న్నారు. వరంగల్లు, ఖమ్మంలలో చక్కని సాహిత్యాభిరుచి అలవడు తున్న సూచన లగుపిస్తున్నాయి. సాహిత్య సమావేశాలు జోరుగా సాగుతున్నాయి-గ్రంథాలయాలద్వారా సర్కారు, నిజాం ప్రాంతాల్లోని ఆంధ్రులు చేతులు కలిపారు. పాతూరి నాగభూషణం చాల పాటు పడుతున్నా డీవిషయంలో. ఖమ్మంలో "హాస్కర్స్ క్లబ్" అని కొందరుచేరి గ్రంథప్రచురణం చేస్తున్నారు". పులిజాల హనుమంత రావు కవితావేశం కలవాడై సాధన చేస్తున్నాడు. అంబడిపూడి వెంకటరత్నం వ్రాసిన దక్షిణ ప్రచురించారు. అయోధ్య రామయ్య అనే యువకవి 'ఘంటారావం' ఇత్యాదులద్వారా బయటికి వస్తు న్నాడు - "భాషార్ణవ"మని వ్రాసి నెల్లుట్లవారు వైదీకి - నియోగి

వైషమ్యాలను రేకెత్తించడానికి వెనక్కి నడుస్తున్నాడు, ఈ ఇర వయో శతాబ్దములో! "తరణి" అనే మాసపత్రిక పెట్టి 'సిద్ధాంతి' గారు కొంత సాహిత్య వ్యవసాయానికి క్షేత్రం కల్పిస్తున్నారు. వైషమ్యాల మూలకంగా దివ్యవాణి గోలకొండ, మీజాన్ లలో కొంత వాఙ్మయం పెరిగింది - దీనివలన కొందరు రచయితలు బయటికి వచ్చారు. ఆంధ్ర సారస్వత మహాసభ, అని పెట్టి దాని తరఫున సమావేశాలు జరిపి సాహితీలోకానికి అ. వె. దత్తాత్రేయ శర్మగారు మంచి సేవ జేసినారు. తత్ఫలితంగా "ఆంధ్ర శ్రీ" అనే సంచిక వచ్చింది.

ఈకాలానికే యువకవులనేకసంస్థలద్వారా సాహిత్యవ్యవసాయం సాగిస్తున్నారు. నరసరావుపేటలో "నవ్యకళాపరిషత్తు"స్థాపించి దేశిరాజు కృష్ణశర్మ, అనిశెట్టి సుబ్బారావు, బెల్లంకొండ రామదాసు. మాచిరాజు ఏల్చూరి సుబ్రహ్మణ్యం, పోల్చూరి ఆంజనేయప్రసాద్ మొదలైన, వాళ్ళు నారుమళ్ళు కట్టుకున్నారు. బెజవాడలో "వ్యాస సారస్వత సమితి" అని కొంత కృషిసాగిస్తున్నారు. కొందరు ఏలూరులో సాహిత్య మండలి" అని పెట్టి సామవేదం జానకిరామశర్మ, సింగరాచార్య, పైడిపాటి విద్యాక్, సోమంచి లింగయ్య, కొనకళ్ళ వెంకటరత్నం మొదలైనవాళ్ళు కృషి చేస్తున్నారు. 'ప్రవరుడు - ఛాయావిలసనమ' ని సామవేదంవారి పుస్తకం - 'శ్రావణి' అని వాళ్ళ సంచికా తత్ఫలితాలు. కందుకూరి రామభద్రరావు బీదలతో కలిసిమెలసి ఆయ ననుభవిస్తూన్న 'వేదన'ను ప్రచురించాడు. దేశి "కవితామండలి" పెట్టి ఘంటశాల నుంచి శివరామకృష్ణ, గొత్తిపాటివారు కృషి చేస్తున్నారు - ప్రచురణాలు శర పరంపరవలె వస్తున్నవి. చిన్నపిల్లలకు గొత్తిపాటివారిపాటలు, రచనలు చాలాఉపకరిస్తున్నాయి - కర్లపాలెం కృష్ణారావు, వారణాసి వెంకటేశ్వర్లు అనే కవులు గ్రంథమాలలద్వారా చక్కగా సాగుబడి చేస్తున్నారు. యువకావ్యాలయం మద్రాసుచేరి చక్రపాణి, చలం,

